1994 ... 12 ... సంపుటి: 66, సంచిక: 36, విడి ప్రతి: రూ. 2.00లు


# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి




## తస్మాత్ జాగ్రత్త!

# ధనస్వాములంతా ఏకమౌతున్నారు!

**ముఖ్యమంత్రి సైతం వలలో చిక్కడంతో నెల్లూరు జిల్లా రాజకీయాల్లో డబ్బున్న వాడిదే పైచేయిగా వుంది!**

నిష్ఠూరంగా కన్పించవచ్చు; వింతగా తోచవచ్చు; నిజమా అని ఆశ్చర్య పడవచ్చు; నింద అని సందేహం కల్గవచ్చు; ఈ వార్త చదివే వారిలో మరే భావమైనా కల్గవచ్చు కానీ ఇది పూర్తి వాస్తవం; ప్రజాస్వామ్య ఫలాలు ప్రజా సామాన్యం నుంచి దూరమై పోతాయేమో నని భయపడాల్సిన విషయం.

నెల్లూరు జిల్లా రాజకీయాలలో, మరీ ముఖ్యంగా కాంగ్రెస్ వ్యవహారాలలో ఏడాది పై నుంచి జరుగుతున్న పరిణామాలు గమనిస్తే విచారం కల్గుతున్నది. జిల్లాలో కాంగ్రెస్ పార్టీ క్రమంగా ప్రజలకు దూరమై పోతున్నదన్న బాధ కల్గుతున్నది. ధన స్వాములు, డబ్బు తప్ప మరొక అర్హత లేని వారు మెల్ల మెల్లగా పార్టీని హస్త గతం చేసుకుంటున్నారు. పెత్తనం చలాయించ డానికి చూస్తున్నారు. రాజకీయాలలో డబ్బుకి, డబ్బున్న వారికి ప్రాధాన్యత పెరిగితే, రాజకీయ పార్టీలు, పదవులు ప్రజలకు హానికరంగా పరిణ మిస్తాయి.

నెల్లూరు జిల్లా ప్రజానీకం ఏనాడూ ధనవంతులను రాజకీయాలలోకి ఆహ్వానించలేదు; అభిమా నించలేదు. స్వాతంత్రోద్యమ కాలంలో కాంగ్రెస్ పార్టీ న్యాయవాదులు, ఇతర వృత్తి పరమైన మేధావులు, సంఘ సేవా పరుల నేతృత్వంలో నడిచింది. వీరందరూ మధ్య తరగతి ప్రజలకు చేరువగా మసలేవారు. బెజవాడ గోపాల రెడ్డి వంటి ధనవంతులు ఆనాడూ పార్టీలో వున్న పుటికి వారు తమ సంపదతో కాక సేవా త్యాగాలతో ప్రజలకు చేరువయ్యారు. గోపాల రెడ్డి గారు ఆనాడు, ఈనాడు కూడా ధనగర్వం, అధికార దర్పం ప్రదర్శించి ఎరుగరు. నిరాడంబరత, నిష్కల్మషత్వం, నిజాయితీలతో ఆయన తన రాజకీయ జీవిత మంతా ఆదర్శ ప్రాయంగా గడిపారు. ఆ రోజులలోనే మధ్య తరగతి వర్గం ప్రతినిధిగా వెలుగులోకి వచ్చిన ఎసి సుబ్బారెడ్డి అందర్నీ వెనక్కు నెట్టి నాయకత్వం తాను పెరుక్కొన్నారు. మధ్య మధ్యలో అప్పుడప్పుడు జిల్లాలో పెద్ద భూస్వామ్య కుటుంబాలు, రాజకీయ పెత్తనం కోసం ప్రాకులాడక పోలేదు. వంగల్లు కోదండ రామరెడ్డి, దొడ్ల లక్ష్మి నరసారెడ్డి, పెల్లేటి గోపాల కృష్ణారెడ్డి, వేమారెడ్డి వెంకురెడ్డి, వేమారెడ్డి శ్రీనివాసులు రెడ్డి, గునుపాటి రామచంద్రా రెడ్డి, వెంకటగిరి రాజాల వంటి వారు ఎంతగానో ప్రయత్నించారు. కానీ, వారెవ్వరూ జిల్లా నాయకులుగా గుర్తింపు పొంది, నిలదొక్కుకో లేక పోయారు. ప్రజలు

కొరవ 7వ పేజీలో

# మనవాళ్ళమేధాసంపత్తికి అమెరికన్లుహారతిపడ్తున్నారు!

(గత వారం కొరవ)

అమెరికా దేశం ఒక నానాజాతి సమితి. ప్రపంచంలోని అన్ని దేశాల వారు, జాతుల వారు, మతాల వారు ఐక్యత కలగా పులగంగా కన్పిస్తారు. ఒక్క చికాగో నగరంలో 54 భాషలు మాట్లాడే వారున్నారట. అన్ని జాతుల ప్రజలను ఎటువంటి అరమరికలు లేకుండా తమతో సమానంగా ఆదరించడం, పరిగణించడం అమెరికన్ల సౌహార్దతకు నిదర్శనం. వివిధ దేశాలు, జాతుల ప్రజలలో భారతీయులు, చైనీయులు, జపనీయులు ప్రముఖంగా కన్పిస్తారు. ఈ ముగ్గురిలోనూ ప్రథమ స్థానం మన వారిదే నన్నా అనవచ్చు. భారతీయులంటే చాలా తెలివైన వారని, కష్టించే గుణం కల్గిన వారని పేరు వుంది. చాలా వ్యాపార సంస్థలు, వృత్తులలో భారతీయులు అగ్ర స్థానంలో వున్నారు. పెద్ద పెద్ద పదవులు నిర్వహిస్తున్నారు. అపారమైన సంపదను ఆర్జించారు. అనూహితమైన

## అమెరికా అనుభవాలు

గౌరవాదరణలు పొందుతున్నారు. అర్హతకు తప్ప మరి దేనికి ప్రాధాన్యత నివ్వక పోవడం అమెరికన్ల ప్రత్యేకత. తమ దేశంలో తాము ఇతర దేశస్థుల క్రింద పని చేయ వలసి వస్తున్నదన్న అసూయ వారిలో సాధారణంగా కన్పడదు. అందువల్లే భారతీయులు అంత త్వరగా తమ తమ రంగాలలో ఉన్నతికి ఎదగ గల్గుతున్నారు. సంతోషంగా జీవితాలలో కుదురు కుంటున్నారు.

ఆంధ్ర కుటుంబాలను తప్ప ఇతర భారతీయులను పెద్దగా కలిసి మాట్లాడే అవకాశం నాకు లభించలేదు. ముప్పయ్యేళ్ల క్రితం నుంచే ఆంధ్రులు అమెరికాకు వలస రావడం ప్రారంభమైంది. అట్లా వలస వచ్చిన వారిలో అత్యధిక సంఖ్యాకులు విశేషమైన తెలివి, విషయ పరిజ్ఞానం కల్గిన వారు. స్వదేశంలో తమ అర్హతకు తగిన అవకాశాలు లభించక ఎందరో డాక్టర్లు, ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు అమెరికాకు వచ్చేశారు. వారి మేధోసంపత్తికి అమెరికా దేశం హారతి

కొరవ 7వ పేజీలో



వ్యవసాయరంగంలో అమెరికన్లు సాధించిన ఆధునికతకు అద్దం పట్టే దృశ్యం!

# టిక్కెట్లకువర్గ నేతలసిగపట్లు

వచ్చే ఎన్నికల్లో తమ మద్దతు దార్లకు పార్టీ టిక్కెట్లు సంపాదించుకొని, తమ 'ఉనికిని' కాపాడు కోవాలని కాంగ్రెస్‌లోని వివిధ గ్రూపు నాయకులు సిగపట్లు పడ్తున్నారు. ముఖ్య మంత్రితో ఎలాగూ తమకు సరిపడదు కాబట్టి టిక్కెట్ల పంపకంలో ముఖ్యమంత్రి ప్రమేయం లేకుండా చేయాలని వీరు శత విధాలా కృషి చేస్తున్నారు. టిక్కెట్లు పంపకం ముఖ్యమంత్రి చేతిలో పెడ్తే ఆయన ప్రత్యర్థి వర్గాల గొంతు కోస్తారని సీనియర్ నాయకులు ప్రధానికి మొర పెట్టుకున్నారు. ముఖ్యమంత్రి మాత్రం సోమ వారం నుంచి జిల్లాల వారీగా సమావేశాలు పెట్టి తన గ్రూపు ప్రయోజనాల్ని కాపాడటంలో మునిగి వున్నారు. టిక్కెట్ల పంపిణీలో తన ఆధిపత్యాన్ని నిలబెట్టు కోవాలన్న దృఢ నిశ్చయంలో ఆయనలో కన్పిస్తున్నది. ఎలాగూ సిట్టింగ్ ఎమ్మెల్యేల్లో 30 శాతం మందికి కోత వుంటుంది కాబట్టి తన ప్రత్యర్థి వర్గీయుల పై ఈ కోత అస్త్రాన్ని సంధించడానికి రంగం సిద్ధం చేస్తున్నారు. కాగా టిక్కెట్ల విషయమై జనార్దన రెడ్డి, వై.ఎస్. ప్రభృతులు తమ వంతు ఢిల్లీలో ప్రయత్నాలు చేసుకుంటున్నారు. అధిష్టాన దేవుడి అనుగ్రహం వుంటే కోట్ల కోటను బీటలు తీయడం కష్టం కాదని అభిప్రాయ పడ్తున్నారు. మొత్తం మీద కాంగ్రెస్‌లో వాతావరణం గరమ్ గరమ్‌గా వుంది.

## ముఖ్యమంత్రిలోమార్పేలేదు!

# సీనియర్లరుసరుసలు- చిర్రెత్తినపరిశీలకులు

రాష్ట్ర కాంగ్రెస్ పార్టీలోని ముఠా తగాదాలకు తెరదించి అందర్నీ సమైక్యం చేసేందుకు అధిష్టానం శతవిధాలా ప్రయత్నిస్తున్నప్పటికీ ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డి మాత్రం తన ప్రత్యర్థి వర్గాలను వేధిస్తూ అసమ్మతిని జటిలం చేస్తున్నారని రాష్ట్రానికి చెందిన సీనియర్ [illegible]గ్రెస్ నాయకులు ఏఐసిసి [illegible] ఫిర్యాదు [illegible] ప్రధాన మంత్రి సమైక్యతా సందేశాన్ని రాజధానికి మోసుకొచ్చిన ఏఐసిసి పరిశీలకులు, కేంద్ర మంత్రులు శ్రీ ఎ.కె. ఆంటోని, ప్రణబ్ [illegible] నాడు పార్టీ ఎమ్మెల్యేలు, ఎంపీ 'మేళా' నిర్వహించి అసమ్మతి అగ్ని గుండాన్ని ఆర్పటానికి విఫల యత్నం చేశారు. ఒక పక్క పరిశీలకులు సమైక్య రాగాన్ని ఆలపిస్తూ అసమ్మతీయులను [illegible]స్తుండగా, మరో పక్క ముఖ్యమంత్రి తన మద్దతు దారుల్ని ఉసికొలిపి వై.ఎస్. ప్రభృతుల పై ఆరోపణాస్త్రాల్ని సంధింపజేశారు. దింతో రాష్ట్రంలో నెలకొన్న "వాస్తవ" పరిస్థితిని ప్రధానికి వివరించ గలమని పరిశీలకులు తమ సీనియర్ నాయకులతో అన్నట్లు తెలిసింది. పరిశీలకులు విస్తృత సమావేశం తర్వాత మాజీ ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళ రావును ఆయన స్వగృహంలో కలుసుకొని అరగంట

### రాజధానిలేఖ

సేపు చర్చించారు. ముఖ్యమంత్రి కరడు గట్టిన ముఠా సంస్కృతి వల్ల రాష్ట్రంలో పార్టీ గడ్డు పరిస్థితిని ఎదుర్కొంటోందని, ప్రత్యర్థి వర్గాలను వెంటాడి వేధించే ముఖ్యమంత్రి వైఖరికి ముందుగా అడ్డు కట్ట వేసి ఆ తర్వాతే సమైక్యత ప్రయత్నాలు ప్రారంభించాలని వెంగళ రావు పరిశీలకులతో అన్నట్లు తెలుస్తోంది. ముఖ్యమంత్రి తన పై కక్ష సాధింపు ధోరణితో ఎలా వ్యవహరిస్తోంది 'వెంగళ రావు' ఉదాహరణలతో వివరించారట. రాష్ట్రంలో మూసీనిరాశ్రిత గిల్లి కజ్జాలు పెడ్తుంటే మిగతా వాళ్లను నిందించడం పొరపాటని వెంగళరావు అన్నారట. మాజీ ముఖ్య మంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి కూడా దాదాపు ఇదే రకమైన అభిప్రాయం వ్యక్తం చేశారట. మరో మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కర రావు కూడా ముఖ్యమంత్రి ధోరణిని విమర్శించారట. ద్రోణంరాజు, వై.ఎస్. వర్గీయులు ముఖ్యమంత్రిని మారమనండి; ఆ తర్వాత పరిస్థితులన్నీ చక్క బడ్తాయని చెప్పారట. మొత్తం మీద ముఖ్యమంత్రి పై సీనియర్ల సుసరుసలను పరిశీలకులు మూట కట్టు కోవాల్సిన పరిస్థితి నెలకొన్నది. అయితే ముఖ్యమంత్రి మాత్రం గాంధీ భవన్‌లో జరిగిన సమావేశంలో "తాను అందర్నీ కలుపుక పోతానని చెప్పి పరిశీలకుల్ని మెప్పించాలని ప్రయత్నించారు. కానీ తన వర్గీయులైన మైసూరా ప్రభృతులతో వై.ఎస్. ద్రోణంల పై సుదీర్ఘమైన ఆరోపణాస్త్రాల్ని 'ఫిర్యాదు' రూపంలో పరిశీలకులకు అంద జేయించి తన 'సహజత్వాన్ని' మరోసారి చాటుకున్నారు" దీనితో చిర్రెత్తిన పరిశీలకులు మూటా ముల్లె సర్దుకొని ఢిల్లీ [illegible]నం ఎక్కారు.

### మార[illegible] [illegible]ఖ్యమంత్రి

అందర్ని [illegible] పుక పోతానని ఒక వైపు ఉపన్యాసాలిస్తూన్న [illegible] మంత్రి మరో వైపు ప్రత్యర్థి పీకల్ని కత్తిరిస్తున్నారు. తనతో సఖ్యంగా

కొరవ 8వ పేజీలో

# ఫోటో కార్డుల పేచీ

దేశంలోని ఓటర్లందరికీ ఫోటో గుర్తింపు కార్డులు జారీచేసే విషయంలో ఇప్పటికీ ప్రతిష్టంభన కొనసాగడం శోచనీయం. డిసెంబరులోగా ఓటర్లకు గుర్తింపు కార్డు లివ్వకుంటే 1995 జనవరి 1 తే. నుంచి ఏ రాష్ట్ర శాసన సభకూ ఎన్నికలు జరిపించనని చీఫ్ ఎలక్షన్ కమీషనర్ శ్రీ టి.ఎన్. శేషన్ చాలా కాలం క్రితమే ప్రకటించారు. తన హెచ్చరికను ఆషా మాషీగా తీసుకోవద్దని, రాష్ట్ర ప్రభుత్వాలు తన మాట విని తీరాలని ఆయన అప్పుడప్పుడూ చెప్తూనే వున్నారు. ఇందువల్ల రాజ్యాంగ ప్రతిష్టంభన ఏర్పడినా లెక్క చేయనని కూడా ఆయన బెదరించారు. శేషన్ ఎంత మొండి మనిషో, మంకు పట్టు పడితే ఎంతకైనా ఎట్లా తెగిస్తాడో అందరికీ తెలుసు. ఆయన చెప్పిన డిసెంబరు ఇంకెంతో దూరంలో లేదు. ఒకటి రెండు ఈశాన్య రాష్ట్రాలు తప్ప ఇప్పటి వరకు ఏ ప్రధాన రాష్ట్రమూ ఈ విషయంలో చొరవ చూపించ లేదు. ఆంధ్ర ప్రదేశ్, కర్ణాటకలకు డిసెంబరు లోపల ఎన్నికలు జరిగి పోతాయి కాబట్టి ఇబ్బంది లేదు; అయితే బీహార్, గుజరాత్ వంటి రాష్ట్రాలలో వచ్చే మార్చిలో ఎన్నికలు జరగ వలసి వుంది. వారెవరూ గుర్తింపు కార్డుల విషయంలో ఇంత దాకా ఎటువంటి చర్యలూ తీసుకోలేదు. అందుకే శేషన్ ఇటీవల రాజ్యాంగ ప్రతిష్టంభన ఏర్పడినా తాను బాధ్యుడ్ని కానని బెదరించారు.

ఆందోళన కరంగా, ప్రమాద కరంగా మారుతున్న పరిస్థితి తీవ్రతను గమనించిన ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు ముఖ్య మంత్రులకు, ప్రధాన ఎన్నికల కమీషనర్‌కు మధ్య రాజీ చేయడానికి ముఖా ముఖి సమావేశం ఏర్పాటు చేశారు. కానీ దానివల్లా పరిస్థితి మెరుగు పడలేదు. వరదలు, కరువులు వంటి ఉత్పాతాలలో సత మతమౌతున్న తమ ప్రజలు, ప్రభుత్వాలు ఇంత త్వరగా ఫోటో కార్డులకు సమయము, డబ్బు వెచ్చించే పరిస్థితి లేదని అందరు ముఖ్య మంత్రులూ ముక్త కంఠంతో ప్రధానికి విన్నవించారు. ఎన్నికల కమీషనర్‌తో వారికి రాజీ కుదరలేదు. ప్రధాని ఎంత సానుకూలంగా మాట్లాడినా శేషన్ మెత్త బడలేదు. ప్రతిష్టంభన అట్నే మిగిలి పోయింది.

రౌడీలు, గూండాలు, ముఠా నాయకులు, మాఫియా లీడర్లు, సంఘ విద్రోహ శక్తులు నేరుగా రాజకీయాలలోకి వచ్చి, పదవుల వేట ప్రారంభించిన తర్వాత దేశంలో ఎన్నికల సరళి మారి పోయింది. తుపాకులు చూపి, మూక బలం ప్రదర్శించి, రిగ్గింగులు, దౌర్జన్యాలు, బ్యాలెట్ పెట్టెలు ఎత్తుక పోవడాలు, దొంగ ఓట్ల పోలింగ్ వంటి దుర్మార్గాల ద్వారా ఎన్నికలలో గెలవ డానికి పలువురు అభ్యర్థులు ప్రయత్నిస్తున్నారు. ఈ అవాంఛనీయ పోకడలు నివారించ డానికి ఫోటో గుర్తింపు కార్డులు కొంత వరకు ఉపకరిస్తాయి. భయ పెట్టి ఓటర్లను బూతుల దగ్గరకు రానివ్వ కుండా చేసే పరిస్థితులలో కార్డులుండి దండగే కాని, సాధారణంగా జరిగి పోయే దొంగ ఓట్ల పోలింగ్‌ను ఇవి నివారిస్తాయి. ప్రజాస్వామ్యం కొద్దో గొప్పో బ్రతికి బట్టకట్టడానికి అది చాలా అవసరం. శేషన్ అంత గట్టిగా ఉడుం పట్టు పట్టాడు కాబట్టి, ఈ సమస్య పైన ప్రధాన మంత్రి, ముఖ్య మంత్రులు ఈ మాత్రమైనా స్పందిస్తున్నారు. ఇప్పుడు సలువిస్తే, ఒకసారి ఎన్నికలు జరిగి పోయాయంటే, ఇక కార్డుల సంగతి అందరూ మర్చి పోతారు. ఎప్పటికీ ఆ విధానం అమలు కాదు.

దేశంలోని 60 కోట్ల మందికి కార్డులివ్వ డానికి కనీసం 1600 కోట్లు కావాలి కాబట్టి, అంత డబ్బు సమకూర్చడం తమ వల్ల కాదని ప్రభుత్వాలు చేతులెత్తే స్తున్నాయి. ప్రజాస్వామ్యాన్ని పటిష్ట పరచే ఒక ప్రధాన ప్రక్రియకు డబ్బు లోటు అడ్డంకి అనడం అన్యాయం. దండగ మాలిన పథకాలకు వేల వేల కోట్లు తగలేస్తున్న ప్రభుత్వాలకు ఇది పెద్ద వ్యయం కాదు. వారు మూల గ్రామాలలో ఓటర్లను వెతికి పట్టి కార్డు లివ్వడం కష్ట సాధ్యమని చెప్తున్నారు. అదీ ఆచరణకు సాధ్యం కానంత కష్టమేమీ కాదు. ప్రభుత్వాలకు చిత్త శుద్ధి వుంటే మార్చి లోపల కార్డులు పంచి పెట్టేయ గలవు.

ఫోటో కార్డులను కేవలం ఓటరు గుర్తింపుగా కాకుండా, సామాజిక గుర్తింపు కార్డుగా పరిగణించ గల్గితే దేశానికి చాలా ఉపయోగం. ప్రతి పౌరుడికీ, ఓటరైనా, కాకపోయినా సరే - ఒక గుర్తింపు కార్డు ఇచ్చి - దానికి అనుబంధంగా వారి వ్యక్తిగత, కుటుంబ వివరాలు, ఆస్తిపాస్తులు, వృత్తి విశేషాలు తదితర సమాచారాన్నంతా సేకరించి, కంప్యూటర్లలో నిక్షిప్తం చేయగల్గితే ప్రణాళికా రచన, వివిధ పథకాల అమలు సులభ సాధ్య మౌతాయి. పౌరులందరి ఆర్థిక, సామాజిక వివరాలు ప్రభుత్వం చేతిలో వుంటే ఎంత సౌకర్యమో చెప్పలేము. నేరాల నిరోధం, జనాభా నియంత్రణ, ఆహారం, నీరు, విద్య, వైద్యం వంటి పౌర అవసరాలపై ప్రభుత్వాలకు సమగ్ర అవగాహన, సమాచారం లభిస్తాయి. తద్వారా అభివృద్ధికి వెచ్చించే లక్షలాది కోట్ల రూపాయల వ్యయాన్ని క్రమబద్ధీకరించ వచ్చు. తగిన లెక్కపక్కలు లేక జరుగుతున్న వృథాను అరి కట్టవచ్చు. ఆ పొదుపుతో పోల్చితే, గుర్తింపు కార్డుల వ్యయం పెద్ద లెక్కలోకి రాదు.

ఇప్పటికే గ్రామాలలో, పట్టణాలలోని ప్రజానీకానికి వివిధ సంస్థలు పలు రకాల గుర్తింపు కార్డులు ఇచ్చి వున్నాయి. సహకార పరపతి సంస్థలు, చౌక డిపోలు, గృహ నిర్మాణ సంస్థలు, గిరిజనాభి వృద్ధి కార్పొరేషన్లు విడివిడిగా కార్డులు పంపిణీ చేసి వున్నాయి. వీటన్నింటికీ రాష్ట్ర ప్రభుత్వాలే వ్యయం చేస్తున్నాయి. ఒక్కొక్క కుటుంబానికి ఒక్కొక్క సంస్థ ఒక్కొక్క కార్డు ఇవ్వడం కంటె అందరూ కల్సి ఒకటిగా - జారీ చేయడం ద్వారా, దానినే ఓటరు గుర్తింపుకు వాడడం ద్వారా వ్యయ [illegible] పొదుపును సాధించ [illegible]

జమీన్‌రైతు

కార్డులివ్వకుంటే ఎన్నికలు జరిపించనని భీష్మించుకుని కూర్చోవడం శేషన్ నిరంకుశత్వాన్ని సూచిస్తున్న ప్పటికీ, ఒక్క వ్యక్తి మొత్తం ఎన్నికల వ్యవస్థను శాసించడం ప్రమాద కరమైన ప్పటికీ, శేషన్ చేస్తున్న వాదం నిర్హేతుక మైనది కాదు. ప్రజా స్వామ్యాన్ని పరిపుష్టం చేయడానికి ఆయన పడుతున్న తపనను అర్థం చేసుకో గల్గితే ఇందులో తప్పు పట్టాల్సిందేమీ వుండదు. ప్రధాన మంత్రి ఏదో ఒక రూపంలో ముఖ్య మంత్రులను ఒప్పించి, ఈ సమస్యను సానుకూలంగా పరిష్కరించ గలడనే ఆశిద్దాం.

---

## జమీన్‌రైతు 15-9-1944

పేజీలు : 6 వెల : 0-1-6

# 50 ఏళ్లక్రితం ఈవారం

### ఎలుక కాటుకు - పిల్లిమాంసం

ఈమధ్య ఒక ఒడ్డె మనిషికి ఎలుక కరిచి జ్వరము ఒల్లువాపువచ్చి జబ్బుచేసింది. దేనితోనూ నెమ్మది కాలేదు. ఒకరి సలహాతో పిల్లిమాంసం వండి పెట్టగా రెండు మూడు దినములకు నెమ్మదించినది. ఈ విషయాన్ని గురించి వైద్యు లేమంటారు?

-డాక్టర్. యం. ఎ. శేషగిరిరావు.

### సర్కస్ -చెంచులక్ష్మి రూపాయికి రెండుమజా!

సర్కస్ చెంచులక్ష్మిచ
ప్రక్క ప్రక్కన వర్తతే
పల్లెటూరి ప్రజాభ్యంచ
దోపిడంచ ఫలం లభేత్.

-ట్రంకురోడ్డు పురాణం.

సింహపురపురంబునకు పరశు రాం సర్కస్ దొరగారున్నూ, వినాయకలో చెంచులక్ష్మి దొరసాని గారున్నూ దిగినారు. భాద్రపద బహుళం జమీన్‌రైతులో గూడా చిట కృని చిరునవ్వు నవ్వుతుండగ మున్నూ, జాపేమ మూలాన యానాది సుబ్బక్క దగ్గరా గూడా రాజు తల కాయలుండే కాగితాలు నాలుగు తిత్తిలో నానుతుండగ మున్నూ వీరి అదృష్ట కారణాలు. ఇక పల్లెటూళ్ళనుండి ఆబాల గోపాల మంతా మూటకూళ్ళతో కిటకిటలాడి పోతున్నది. ట్రంకురోడ్డు భూదేవి సాయింత్రమయ్యేటప్పటికంతా యీ జనాన్ని మొయ్యలేక నడ్డినీల్గిపోతూ ఓయిబాబో! ఇక ఒక్క క్షణం కూడా నావల్ల కాదని ఎ.సి. రెడ్డి పార్కుదగ్గర చతికిలబడి కూర్చుంటున్నది. ట్రంకురోడ్డున చూస్తే రేబాల పట్టయ్య పెళ్ళినాటి జనసమ్మర్దం జ్ఞాపకాని కొస్తున్నది. సర్కస్ దగ్గర దర్శిస్తే భర్తల, భార్యల, పర్సుల పోగొట్టుకున్న అనేకరకాలు.

సింహాలు, పులులు, ఏనుగులు, గుర్రాలు, కుక్కలు, మేకలు, స్త్రీపురుషులు, తమకు నిర్వర్తించిన సాహసోపేత కార్యాలు భయభక్తులతో దొడ్లవారి దివాణంలో నౌకర్లమాదిరి నిర్వర్తించి చూపరులకు వింతగొలిపెడతవి.

ఇక్కడ మొదట ఆట కాగానే యీ జనాభా అంతా వేమూరు జగ్గయ్య పంతుల కోలాహలంతో ఆడ మొగ భేదం లేకుండా చెంచులక్ష్మి మీద పడడం, ఇరిజాచి వినాయక భర్త రామమూర్తిగారు

తరువాయి 10వ పేజీలో

---

# నాటకాలరాయుడికి అధికారంఅప్పచెప్పేస్తారా?

రాజకీయాలు నానాటికి దిగజారి పోతున్నాయి. ముఖ్యంగా కాంగ్రెస్‌లో వర్గ పోరాటాలతో ఒకరి నొకరు వెన్ను పోటు పొడుచుకొని మళ్లీ నాటకాల రాయుడికి అధికారం అప్ప చెప్పేటట్లున్నారు. అన్నింటా ఆందోళన పడాల్సిన విషయ మేమిటంటే నేర ప్రవృత్తికి అలవాటు పడిన వాళ్లే రాజకీయాల్లో రాణిస్తున్నారు. కొన్నాళ్లకు రాజకీయ రంగంలో ఎక్కడ చూసినా వాళ్లే కనబడతారేమో! గెలవడం కోసం రౌడీ షీటర్లకు, బ్లాక్ మార్కెటీర్లకు, స్మగ్లర్లకు పార్టీల టిక్కెట్లు ఇవ్వడం దారుణం. వందేళ్ల చరిత్ర గల కాంగ్రెస్ పార్టీలో ఇటువంటి వాళ్లు వుండడం పార్టీ చేసుకున్న దౌర్భాగ్యమే. ఇదే ధోరణి పార్టీ కొనసాగిస్తే తమిళనాడు జయలలితకు, బెంగాల్ జ్యోతిబసుకు, ఆంధ్రను ఎన్టీఆర్‌కు, రాజస్థాన్ వగైరాలు దేముళ్ల పార్టీల వారికి రాసివ్వాల్సి వస్తుంది. స్వరాష్ట్ర పరిస్థితిని ప్రధాని పివి నరసింహా రావు ఎరిగి నీతి, నిజాయితీలకు అగ్రస్థానం ఇచ్చి సమర్థులైన అభ్యర్థులను ఎంపిక చేసి పార్టీ జయ పతాకాన్ని ఎగుర వేయాలి.

గూడూరు -ఆవుల కొండయ్య

### పేదరికమే జనాభా పెరుగుదలకు కారణం!

పరిమితికి మించి అతిగా పెరిగిన జనాభా కారణంగా మన దేశంలో పేదరికం, ఆకలి చావులు, నిరుద్యోగం, అధిక మయ్యాయా? లేక పేదరికమే జనాభా పెరుగు దలకు అసలు కారణమా? అనేది నేడు ప్రధాన ప్రశ్నగా మారి వుంది. మన దేశ జనాభాలో 50 శాతం జనం తిండి లేక మల మల మాడే

## జనవాణి

దౌర్భాగ్యానికి ప్రధాన కారణం; మన రైతులు ఆహార ధాన్యాలను చాలి నంత పండించ లేక పోవడం కాదు. ప్రతి ఏటా మన దేశంలో 18 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలు వుత్పత్తి అవుతున్నాయి. కాని16 కోట్ల టన్నులుంటే మన దేశ ప్రజలందరి ఆహార వరసరాలు తీరుతాయి. ఆహార ధాన్యాల ఉత్పత్తిలో ఇంత మిగులుంచి కూడా, మన దేశంలో ఆకలి చావులు సంభవిస్తున్నా యంటే ప్రభుత్వ వనరుల పంపిణీ విధాన అవకతవకలే ఇందుకు ప్రధాన కారణం. పేదరికం పెద్ద జబ్బు కంటె తీవ్రాతి తీవ్రమైంది. కాని వీరే జనాభా పెరుగు దలకు మూల పురుషులవు తున్నారు. వృద్ధాప్యంలో ఆధార పడడానికి ఆస్తి పాస్తులు, పెన్షన్లు వుండవు గనక ఎక్కువ మంది బిడ్డల్ని కంటె వారిలో ఒక్కరైనా ముసలి తనంలో ఆదుకుంటారనే ఆలోచనతో అధిక జనాభాకు దోహద పడుతున్నారు. 1947 లో మన దేశ జనాభా 34 కోట్ల 20 లక్షలు నేడది 90 కోట్లకు చేరుకుంది. రేపటి మరీ పెరిగి విరా ట్రూపం ధరించి సమస్తాన్ని విధ్వంసం చేసే ప్రమాద ముంది. జనాభా పెరుగుదలను అరి కట్టాలంటే పేదరికాన్ని సమూలంగా నిర్మూలించ డమే శాస్త్రీయ మార్గం.

గూడూరు -పి.వి. ప్రభాకర రావు

### సారా నిషేధానికి ఆద్యులు శ్రీ రాములు

పాత రోజుల్లో నెల్లూరులో మురుగు దొడ్లు తీర్చి శుద్ధి చేసే పారిశుద్ధ్య కార్మికులు, ఊరి బయట భంగి కాలనీలో వుంటూ కల్లు, సారాయి విపరీతంగా త్రాగేవారు. అమర జీవి పొట్టి శ్రీరాములు ఆ

తరువాయి 10వ పేజీలో

# రాజమాతరాకలో రాజసంకన్పించలేదు!

భారతీయ జనతా పార్టీ జాతీయ ఉపాధ్యక్షురాలు, గ్వాలియర్ మాజీ రాజ మాత విజయ రాజ సింధియా నెల్లూరు రాక - షోక నిరాడంబరంగా జరిగి పోయాయి. అద్వానీ వచ్చినప్పుడు కనపడినంత హంగామా ప్రచార లోపమేమో తెలియదు గాని టౌన్ హాల్ సభ కిట కిట లాడలేదు. జాతీయ ప్రధాన కార్యదర్శి ఎం. వెంకయ్య నాయుడు, రాష్ట్ర కమిటీ కార్యదర్శి శ్యామ్ ప్రసాద్, మహిళా మోర్చా అధ్యక్షురాలు శాంతారెడ్డి, జిల్లా కమిటీ అధ్యక్షుడు సి.హెచ్. వరదయ్య వేదిక పై ఆశీనులయ్యారు. రాజ మాత మాట్లాడుతూ గూండాలు, మాఫియా గ్యాంగులతో కుమ్మక్కై పరిపాలన చేయవచ్చనే సంప్రదాయం రాజకీయాల్లో ప్రవేశించింది. రాజకీయాధికారం కోసం ఏ పనైనా చేస్తున్నారు. అధికారంలోకి రాక ముందు వచ్చిన తరువాత మోసాలు చేయడం పరిపాటయ్యిందంటూ, ప్రజా జీవనానికి రక్షణ లేని పరిస్థితులు

### నెల్లూరు సంగతులు

నేడున్నా యన్నారామె. జాతి వ్యతిరేక శక్తుల కార్యకలాపాలు మితి మీరి పోయాయి; జాతీయ పతాకం ఎగుర వేసేందుకు బలి దానం చేయవలసిన పరిస్థితులు నేడు కాశ్మీర్‌లో వున్నట్లు వివరించారు. సారా నిషేధ ఉద్యమాన్ని విజయ వంతం చేసిన జిల్లా మహిళలను చూసి ఒక మహిళగా గర్వపడుతున్నట్లు చెప్పారు.

వెంకయ్య నాయుడు కేంద్ర ప్రభుత్వం కుంభకోణాల్లో కూరుకు పోయిందన్నారు. ఆరుగురు మంత్రులకు పది వేల కోట్ల రూపాయల పేర్ల కుంభకోణంలో ప్రమేయం వుందని జాయింట్ పార్లమెంటరీ కమిటీ నిక్కచ్చిగా చెప్పినా ఫలితం లేక పోయిందని దుయ్యబట్టారు. రాష్ట్ర పరిస్థితి అస్తవ్యస్తంగా వుంది. రాయలసీమలో అక్రమ ఆయుధాల పై చర్యలు తీసుకోకుండా లైసెన్స్ వున్న ఆయుధాల్ని రాబట్టు కోవడంలో అంతర్యమేమిటో అర్థం కావడం లేదు. కాపుల్ని, ముస్లింలను వెనుక బడిన తరగతుల్లో చేరుస్తున్నట్లు ఎన్నికల సమయంలో ప్రకటించడం భావ్యం కాదన్నారు. ఏడేళ్లు అధికారంలో వుండి ఏమీ సాధించని ఎన్టీఆర్ తనకు మళ్లీ అధికారం ఇస్తే 45 రోజుల్లో పరిస్థితులన్నీ చక్క బెడతానని చెప్పడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఏ పార్టీ నాయకులు ఏ పార్టీలో చేరాదనే బులిటెన్ దూరదర్శన్ ప్రసారం చేయాలని ఎద్దేవా చేశారు. బిజెపి రాష్ట్రంలో అన్ని స్థానాల్లో ఏ పార్టీతో పొత్తు లేకుండా పోటీ చేస్తుందన్నారు. ప్రత్యామ్నాయమా? ప్రతి రూపమా? అనే నినాదంతో ప్రజల్లోకి పోతామన్నారు. సభకు ఆచార్య ఆదిత్య అధ్యక్షత వహించారు.

## కాళిదాసకాలామృతంలో శాస్త్రవేత్తలునేర్చేఅంశాలు!

టౌన్ హాల్ రీడింగు రూంలో సాహిత్య సదస్సు యాజమాన్యాన కాళిదాస జయంతి సభ జరిగింది. కుర్తాళం పీఠాధిపతి శివచిదానంద భారతిస్వామి అధ్యక్షించగా డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. నెల్లూరు సీమ సంస్కృతాంధ్ర సాహితీ రంగాలలో విశిష్ట స్థానం అలంకరించింది. ఉపాధ్యాయ దినోత్సవాన్ని గురు పూజోత్సవం అని అంటున్నాం; ఈ రోజున కవికుల గురువు కాళిదాస మహాకవి జయంతి సభ జరగడం ముదావహమైన విషయం అంటూ, గుర్రం సుబ్రహ్మణ్యం కాళిదాసుని కావ్య నాటకాలను పఠించని ఆంధ్రీకరించి తెలుగు పాఠకులకు అందించినట్లు చెప్పారు. కుర్తాళం స్వామీజీ మాట్లాడుతూ కాళిదాస కవి రసవంతమైన సార్వజనీనమైన కవితా విష్కరణ చేయడమే కాదు, జ్యోతిష శాస్త్ర విమర్శవిదుడు; వారి ఉత్తర కాలామృతం ఈనాటికీ శాస్త్రజ్ఞులకు గోషాంశాలను వివరిస్తున్నట్లు చెప్పారు. ముఖ్యోపన్యాసకులు ఇలపావులూరి కామేశ్వర రావు కాళిదాసుని ఉపమాలంకార రచనా వైదుష్యాన్ని సోదాహరణంగా వివరించారు; పాతది మాత్రమే మేలు - క్రొత్త దైనందున మంచిది కాదు; వివేక సంపన్నుడు పాత క్రొత్తలను పరిశీలించి మేలైన

కొరవ 11వ పేజీలో

### సంస్కృత పాఠశాలలో కుర్తాళం స్వామి

114 ఏళ్ల క్రితం కుర్తాళం మౌన స్వాముల వారు శంకుస్థాపన చేసిన మూలపేటలోని వేద సంస్కృత పాఠశాలను 12 తేది ప్రస్తుత పీఠాధిపతి శివచిదానంద భారతీ స్వామి సందర్శించారు. కళాశాల పాలక వర్గం, ఉపాధ్యాయ, ఉపాధ్యాయేతర వర్గం స్వామి వారికి పూర్ణ కుంభంతో వేద పఠనం చేస్తూ స్వాగతం పలికారు. విద్యార్థుల నుద్దేశించి కుర్తాళం స్వామి మాట్లాడుతూ మన ఆర్ష సంస్కృతికి సంస్కృతం మూలం. అట్టి వేద సంస్కృతాలను కాపాడ వలసిన బాధ్యత ప్రభుత్వం పై వుందన్నారు. ప్రజా సదస్సులను ఏర్పాటు చేసి వేద విద్యల విలువలు తెలియ జేయాలి. రాష్ట్రంలోని అన్ని సంస్కృత కళాశాలలను విద్యార్థుల సంఖ్యా నియమాన్ని పరిగణించక [illegible] న్నారు. పాలక వర్గ [illegible] ప్రస్తుత కార్యదర్శి చతుర్వేదుల శ్రీరామమూర్తి శిథిలావస్థలో వున్న భవనాలను పున రుద్ధరిస్తున్నందుకు అభినందించారు. పాలక వర్గ అధ్యక్షులు చిపురుల సత్యనారాయణ చివరకు వందనాలు చెప్పారు.





## సఖుగుడు

### * అంగళ్లమూస్తేత్రాగుడుమానరు!

నెల్లూరులో బ్రాందీ ప్రియుల మనసు మార్చడానికి మరొకసారి మహిళలంతా వీధుల్లోకి వచ్చారు. నెల్లూరు అడపడచులు వీర నారీమణుల కోవకు చెందిన వారని అక్షరాస్యతా ప్రచారంలోనే రుజువైంది; సారా ఉద్యమంతో ప్రప్రపంచమంతా గుర్తించింది. అప్పుడీ బ్రాందీ ఆందోళనా విజయవంతమైతే వారి పోరాట పటిమ చరిత్రపుటల్లో శాశ్వతంగా నిల్చిపోతుంది. కలకంఠి కంట కన్నీరొలకడం పైనే ఇంత కాలం కవులు భావ కవిత లల్లారు; ఇప్పుడు కోమలి కుపితురాలైతే కల్లోలమేనని రౌద్ర గీతాలు రచించాలి. నాయకత్వమన్నది లేకుండా, ముందుకు నడిపించేవారు లేకుండా ప్రేరణ ఇచ్చేవారు లేకుండా వంటింటికి పరిమితమనుకున్న ఆడవాళ్ళు; అందులోనూ చదువు సంధ్య ఎరుగని, బాహ్యప్రపంచంతో సంపర్కం లేని, కుటుంబ వ్యవహారాలలోనూ మగడి చాటున మగువ అన్న సాంప్రదాయానికి బద్ధులైన గృహిణులు- తమంత తాముగా, స్వచ్ఛందంగా, ఒకరికొకరు కూడబలుక్కొని కీలకమైన సామాజిక

### డోలేంద్ర

సమస్యలపై సంస్కరణోద్యమాలు నిర్వహించడం చరిత్రలోనే అరుదు; అపూర్వం. అందువల్లే నెల్లూరు మహిళను యావద్భారత మేధావి వర్గం ఆకాశానికెత్తి పొగుడుతున్నది; ప్రపంచం యావత్తూ ప్రశంసలతో ముంచెత్తు తూంది.

కొరవ 7వ పేజీలో

## రొయ్యలనుఆపలేము- సమస్యలుపరిష్కరిస్తాం!

రాష్ట్ర పర్యావరణ సైన్సు అండ్ టెక్నాలజీ శాఖ మంత్రి శశిధర్ రెడ్డి 14 తేది నెల్లూరు వచ్చారు. సైక్లోన్ మీటింగ్ హాల్ జిల్లా పర్యావరణ కమిటీ తొలి సమావేశంలో కూడా పాల్గొన్నారు. పర్యావరణకు అడ్డంకిగా తయారైన పలు సమస్యల పై చర్చ జరిగింది. దురదృష్ట మేమిటంటే ఏ అంశం కూడా పరిష్కరిస్తానని మంత్రి స్పష్టంగా హామీ ఇవ్వలేదు. కోవూరు థర్మల్ పవర్ స్టేషన్, సర్కార్ పేపర్ మిల్, ట్రైబ్ బయో కెమికల్స్ లిమిటెడ్, జిల్లా ఆక్వా కల్చర్ల యూనిట్ల మూలాన జరుగుతున్న పర్యావరణ కాలుష్యం పై చర్చ జరిగింది. విదేశీ మారక ద్రవ్యం విస్తృతంగా ఆర్జిస్తున్నందున రొయ్యల పరిశ్రమను అడ్డుకోలేమని ఉత్పన్న మయ్యే సమస్యలు మాత్రం తప్పక పరిష్కరిస్తా మన్నారు. అందుకోసం జిల్లా స్థాయిలో ఒక ప్రత్యేక కమిటీ ఏర్పాటు చేస్తామని, అది రొయ్యల పరిశ్రమ వల్ల విఘాత పరిస్థితులు ఏర్పడ కుండా చూస్తుందన్నారు. మంచి నీటి సమస్య ఏర్పడిన రెండు, మూడు గ్రామాల్లో పైపు లైన్లు, ట్యాంకర్లు ద్వారా నీరు అందించే ప్రయత్నం కలెక్టర్ చేస్తున్నట్లు చెప్పారు. పొగ కాలుష్యాన్ని నివారించే ప్రయోగాత్మక కార్యక్రమంలో భాగం పెట్రోలు బంకుల వద్దే పరీక్షా కేంద్రాలను పెడుతున్నట్లు చెప్పారు. ఆరు నెలలకొక సారి వాహన యజమానులు ఇందు కోసం రవాణా శాఖ నుండి క్లియరెన్స్ సర్టిఫికెట్లు పొందాలని చెప్పారు. పట్టణంలో అధ్వాన్న స్థితికి చెరిన డ్రైనేజీ వ్యవస్థ పునరుద్ధరణకు 12 కోట్ల రూపాయల కార్యాచరణ పథకాన్ని ఇప్పటికే జిల్లా యంత్రాంగం రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించిన విషయాలన్నీ కలెక్టర్ ఎం. సాంబ శివరావు వివరించారు. సమావేశంలో ఎమ్మెల్యేలు జె.కె. రెడ్డి, సి.వి. శేషారెడ్డి, విష్ణు వర్ధన్ రెడ్డిలతో పాటు, జిల్లా వైద్యాధికారి, మునిసిపల్ కమీషనర్ స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులుగా సంపా, జాగృతి, మానవ హక్కుల సేవా సమాజ్‌లు పాల్గొన్నాయి. రొయ్యల పరిశ్రమల ప్రతినిధిగా శ్రీపి.వి. ప్రసన్న కూడా సమావేశానికి హాజరయ్యారు. శశిధర్ రెడ్డి ఆ తర్వాత కోటంరెడ్డి సోదరులు ఏర్పాటు చేసిన ప్రదర్శనలో పాల్గొని ఇందిరా భవన్‌లో కార్యకర్తల సమావేశంలో ప్రసంగించి వెళ్లారు.

# నక్సలైట్లలో ఏమిటీ నరరూపరాక్షసత్వం?

[illegible]లూరుకు చెందిన ఇంజనీరింగ్ కాంట్రాక్టర్ కంచి సుబ్రహ్మణ్యం నాయుడును (35) 10 తేది రాత్రి 8 గంటల ప్రాంతంలో నక్సలైట్లు ఘాతుకంగా హత్య చేశారు. 4వ టౌన్ పోలీసు స్టేషన్‌కు పాతిక గజాల దూరంలో, మాజీ పిపి శ్రీ రామమూర్తి ఇంటి ఎదురుగా మిద్దె మీద సుబ్రహ్మణ్యం నాయుడు ఆఫీసు వుంది. ఆ రాత్రి నాయుడు ఆఫీసులో పని చూసుకొని, క్రిందకు దిగి, ట్రంకురోడ్డు వైపు నడచి వస్తుండి నారట. కామాక్షి స్టీల్స్ వెనుకగా వున్న చిన్న ఖాళీ స్థలంలో ఐదుగురు నక్సలైట్లు నక్కి వుండి నారట. నాయుడు పదడుగులు ముందుకు నడిచి రాగానే, వీరిలో ముగ్గురు ఆయనకు ఎదురు వెళ్లి, దగ్గరగా [illegible] కణత పై తుపాకీ ఆనించి కాల్చారు. వారెవరో, ఏమి జరుగు తున్నదో తెలుసు కునేలోగానే నాయుడు క్రిందకు వాలి పోయాడట. ఈలోగా [illegible]ండెకు ఆనించి మరి రెండు బుల్లెట్లు పంపారు. అప్పటికె నాయుడు ప్రాణం పోయినట్లుంది. కానీ అనుమానం తీరక క్రింద పడిన శవాన్ని కాలితో తన్ని చూసి, వీపు పైన కత్తితో నాలుగు పోట్లు పొడిచారట. ఇదంతా రెండు, మూడు నిముషాలలో జరిగి పోయింది.

ఆ సమయంలో నాయుడు తమ్ముడు సూర్య ప్రకాశ్, నలుగురు మఫ్టీలో వున్న కానిస్టేబిళ్లు ట్రంకురోడ్డుకు పడమరగా వున్న ఇనుప సామాన్ల అంగడిలో నిలబడి


నెల్లూరునడిబజారులో తుపాకీగుండ్లకునేలవాలిన కాంట్రాక్టరుసుబ్రహ్మణ్యం!

వుండినారు. వారికి బుల్లెట్ శబ్దం విన్పించింది. కాని అదేదో వినాయక చవితి బెట్ అనుకున్నట్లున్నారు. అంగడి యజమాని మొదట నాయుడు క్రిందకు వాలి పోవడం గమనించాడు. కానీ అది హత్య అని భావించలేదు. రెండవ బుల్లెట్ శబ్దంతో అతను జాగ్రత్తగా గమనించి హత్యను పసి గట్టి పెద్దగా కేక పెట్టారు. నాయుడు తమ్ముడు, కానిస్టేబిళ్లు, ఆ యజమాని అటు వైపుకు పరుగెత్తారట. కాని రోడ్డు దాటడంలో ఒక్క [illegible]సెకండు ఆలస్యమైంది. వీరు నాయుడు శవాన్ని చేరేసరికి ఆఖరి నక్సలైటు కత్తితో పొడుస్తుండి నాడట. [illegible] జేబులో నుంచి ఒక [illegible] శవం పైకి విసిరేసి, అతను పారిపోయాడు. వారిని [illegible] కోవడం కంటే, నాయుడును ఆస్పత్రికి తరలించడం అవసరమనే ఉద్దేశ్యంతో వీరు శవాన్ని భుజానికి ఎత్తుకొని వాహబ్ పేట వైపు వెళ్లారు. కానిస్టేబిళ్లు 4 టౌన్ స్టేషన్‌కు వెళ్లి విషయం చెప్పారు. అక్కడి నుంచి వైర్‌లెస్‌లో అన్ని స్టేషన్‌లనూ అలర్ట్ చేశారు.

నాయుడును చంపిన నక్సలైట్లు హత్య కాగానే చర్చి గ్రౌండ్స్ మీదుగా పాత స్టేషన్‌కు వెళ్లి అక్కడ రైలు పట్టాలు దాటి పొలాల మీదుగా బైపాస్ రోడ్డు వైపు పరుగెత్తారు. ఆ సమయంలో 4 టౌన్ స్టేషన్‌కు సమీపంలో వుండిన సిసిఎస్ సర్కిలిన్స్ పెక్టర్ కంపా ప్రసాద్, టౌన్ సిఐ వీరారెడ్డి తదితరులు అప్పటికె బైపాస్ రోడ్డుకు చేరుకున్నారు.

కొరవ 8వ పేజీలో


బొమ్మల [illegible]ట్టీ కంటెస్ట్‌పెట్టి వుంచే ఫస్ట్‌ప్రైజ్‌కు అర్హత కలిగిన కావులీధి వినా[illegible]కుడు; పెన్నలో నిమజ్జనానికి ట్రాక్టర్‌తో లుతున్న ఆనం వివేకానందరెడ్డి.

# చిన్నబంకు కోసం గూడూరులో పంతం!

ఏదైనా చిన్న [illegible] రాజకీయం తోడైతే అది రావణ కాష్టం అవుతుందని ప్రత్యేకంగా చెప్పక్క ర్లేదు. సమస్య వంద ఎకరాల పంట పొలం కాదు. వెయ్యి అంకణాల ఇళ్ల స్థలం కాదు; కేవలం [illegible] ఒక అంకణం స్థలంలో పెట్టిన బంకు! అదే గూడూరులో రచ్చా రావిడికి కేంద్ర బిందువయ్యింది. రాజ వీధి నుండి స్టేట్ బ్యాంక్ రోడ్డులోకి వెళ్లే మలుపులో ఒక వ్యక్తి తన మోకాటి చిప్పతో ప్రభుత్వ స్థలంలో బంకు పెట్టి బాడుగకు ఇచ్చాడు. రోడ్డుకు అడ్డంగా పెట్టిన విషయం పై పలు రకాలుగా మూడు నెలలు రచ్చ జరిగింది. రాజకీయ రొచ్చు చోటు చేసుకోవడంతో సబ్ కలెక్టర్ సునీల్ శర్మ మిన్నకుండి [illegible] బదిలీ అవుతున్నా నని తెలిసిన [illegible]లో సదరు బంకును తొలగించ [illegible] మునిసిపల్ ప్రత్యేకాధికారు హోదాలో ఆదేశించి వెళ్లారు. ఆయనలా వెళ్లగానె ఇటు కొత్తగా వచ్చిన మునిసిపల్

## జిల్లావార్తలు

కమీషనర్ పాత ఆదేశాన్ని పట్టుకెళ్లి బంకును [illegible] కార్యాలయం ఆవరణలో తెచ్చి పెట్టుకున్నాడు. బంకు యజమానికి ఒక ప్రముఖ నాయకుడు అండగా నిలిచి బంకు వుండిన స్థలానికి దొంగ పట్టా

కొరవ 8వ పేజీలో

# నెల్లూరు రాజకీయాలు
## విశ్లేషకుడు

### డిడిఒ బదలీ

నెల్లూరు జిల్లా పరిషత్ అధికారి శ్రీ విష్ణుమ పాశాస్త్రుగా బదలీ చేశారు. కారణం తెలియదు.

### జిల్లా గ్రంథాలయానికి ఛైర్మన్‌గా మెట్టా

నెల్లూరు జిల్లా గ్రంథాలయ సంస్థ కొత్త ఛైర్మన్‌గా శ్రీ మెట్టా చంద్ర శేఖర్ రెడ్డి నియమితులైనారు. మాగుంట సుబ్బరామ రెడ్డి గారి పలుకు బడితో జరిగిన నియామకం ఇది.

మెట్టా చంద్రశేఖర రెడ్డి, కోటపల్లి గూడూరు సమతి అధ్యక్షుడుగా ఒకప్పుడు నెల్లూరు తాలూకా రాజకీయాలలో ఒక వెలుగు వెలిగిన స్వర్గీయ మెట్టా రాజగోపాల రెడ్డి కుమారుడు, సంపన్న కుటుంబీకుడు, యువ కాంగ్రెస్ అధ్యక్షుడిగా కొంత కాలం పనిచేశాడు.

### పత్తి రవీంద్రబాబు ఆశ నిరాశేనా?

నెల్లూరు ఆర్‌టిసి రీజనల్ బోర్డు ఛైర్మన్‌గా పాయినాథన్ అండ్ కంపెనీ పత్తి రవీంద్ర బాబును నియమించి నట్లు ఒక వార్త వచ్చింది. పత్రికలలో పోస ప్రచారమూ జరిగింది. మాగుంట సుబ్బరామ రెడ్డి గారు ముఖ్యమంత్రి నుంచి మాట తీసుకొని వచ్చిన తర్వాత ఈ ప్రచారం జరగడంతో ప్రమాణ స్వీకారోత్సవానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు కూడా చేసుకున్నారు. కానీ, చివరి నిముషంలో ఎవరో సిఎం దగ్గర అడ్డ పుల్ల వేశారట. ఉత్తర్వులు ఆగిపోయి నట్లున్నాయి. సుబ్బరామ రెడ్డి గారు మళ్లీ వాటిని కదలిస్తారో లేదో చూడాలి.

### పూసల రంగయ్యకి పదవి పొడిగింపు

రాష్ట్రటెక్స్‌టైల్స్ డెవలెప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మన్ శ్రీ పూసల రంగయ్యను అదే పదవిలో మరొక ఏడాది పాటు కొనసాగిస్తూ ముఖ్యమంత్రి ఉత్తర్వులు చేశారు.

రంగయ్య కిది చిన్నపదవి. అల్పసంతోషి పాపం.

### రామమూర్తి నగర్‌లో బందిపోట్ల బీభత్సం

నెల్లూరు రామమూర్తి నగర్‌లో 8 తేది అర్ధరాత్రి దాటిన తర్వాత నెమ్మాని హనుమంత రావు అనే విఆర్ కాలేజి లెక్చరర్ ఇంటిలో దోపిడి దొంగలు బీభత్సం సృష్టించారు. హనుమంతరావు, తిరుపతి వెంకటేశ్వర విశ్వ విద్యాలయం పొలిటికల్ సైన్స్, చరిత్రశాఖల అధిపతిగా ఇటీవలే రిటైరైన ప్రొఫెసర్ ఎన్‌హెచ్ సీతారామశర్మ కుమారుడు.

హనుమంతరావు ఇల్లు, డేగా నారసింహారెడ్డిగారి ఇంటికి ఎదురుగా వుంది. రాత్రి రెండు గంటల ప్రాంతంలో ఏడుగురు దుండగులు, వెనుకవైపు గది కిటికీ కమ్ములు వంచి లోపల దూరారట. వారి చేతిలో కత్తులు, కర్రలు, ఇనుపరాడ్లు వున్నాయి. రావడంతోటే హనుమంతరావు చేతులు వెనక్కు విరిచి కట్టేశారు. ఆయన భార్య శ్రీమతి సుగుణ పెద్దగా అరవబోయే సరికి వారి పన్నెండేళ్ల కుమారుడి గొంతుపై కత్తి పెట్టి చంపేస్తామని బెదరించారట. ప్రక్కగదిలో నిద్ర పోతుండిన హనుమంతరావు అమ్మను, చెల్లెలిని చంపేశామని, మీకూ అదే పట్టుందని బెదరించారట. తర్వాత తీరికగా తాళాలు తీసుకుని బీరువాలు తెరిచి 23 సవర్ల నగలు, కిలో వెండి, 12 వేల డబ్బు, స్టీలు సామాన్లు ఒక చీరలో మూట గట్టుకున్నారట దొంగతనానికి వారేమీ తొందర పడినట్లులేదు. నిదానంగా, నింపాదిగా మాట్లాడారట. తాము చదువుకున్న వారమేనని, ఉద్యోగాలు దొరకక ఈ వృత్తి చేపట్టామని చెప్పారట. శ్రీమతి సుగుణ వారితో, తాము కష్టపడి సంపాదించుకున్న సొమ్ము ఈ విధంగా దోచుకొని పోవడం అన్యాయం కాదా అని అడిగితే "మేము పడేది మాత్రం కష్టంకాదా? ఇల్లు దోచుకోవడ మంటె సులభమను కున్నావా? నువ్వు ఒక ఇల్లు దోపిడీ చేసి చూడు, ఆ కష్టం తెలుస్తుంది" అని సమాధాన మిచ్చారట. కొద్ది సేపటి తర్వాత హనుమంతరావు అమ్మను, చెల్లెలిని కూడా నిద్రలేపి వారి మెడల్లోని దండలను కత్తి మొనతో పెరికి తీసుకున్నారట. వీరెవరో సంస్కార వంతమైన దొంగలైనట్లున్నారు. అక్కా, పెద్దమ్మా అని సంబోధిస్తూ, పలురకాల విషయాలు మాట్లాడుతూ, త్రాగడానికి మంచినీళ్లు తెచ్చిస్తూ, ఇంటి చుట్టాలవలె రెండు గంటల సేపు గడిపారు. పోయేటప్పుడు ఫ్రిజ్‌లో నుంచి అన్నం తీసుకొని నాలుగు మెతుకులు తిని వెళ్లారట- సెంటిమెంట్ కాబోలు! వెళ్తూ, వెళ్తూ మంగళ సూత్రాల బదులు పసుపు కొమ్ము కట్టుకోవడం ఎట్నో. రేపు మిమ్మల్ని ఓదార్చవచ్చే వారు నేర్పిస్తార్లే అని చెప్పి వెళ్లారట. వీళ్ళందరూ, పాతిక ముప్పయ్యేళ్ళ వయస్సులో వున్నారట. నెల్లూరు, తెలంగాణా యాసలో మాట్లాడారట.

### లయన్స్ ఉచిత హోమియో వైద్యశిబిరం

నెల్లూరు లైన్స్ క్లబ్ మొట్టమొదటి ఉచిత హోమియో వైద్య శిబిరాన్ని 11తేది కావలిలో నిర్వహించింది. లైన్స్ జోన్ ఛైర్మన్ ఎస్ఎస్‌విచ రామ్మోహనరావు శిబిరాన్ని ప్రారంభించగా, ముఖ్య అతిథిగా కావలి మునిసిపల్ మాజీ వైస్ ఛైర్మన్ గ్రంధి యానాది శెట్టి విచ్చేశారు. డాక్టర్లు లక్ష్మణరావు, విద్యాసాగర్, అశోక్ కుమార్ వందలాది రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంచిపెట్టారు. శిబిరంలో హోటల్ శివం అధినేత లయన్ యడ్లపల్లి సురేష్ పి. సత్యనారాయణ, ఎన్. సంతోష్ కుమార్, వి. బద్రీనాథ్, పి. ఆనందకృష్ణ, డి. భాస్కర్, కె. విజయసేనారెడ్డి, చిన్ని శ్రీనివాసులు పాల్గొన్నారు.

### కిరాయి హంతకులు

నెల్లూరు జిల్లా కోర్టు ఆవరణలో 14తేది ఉదయం ఆళ్లగడ్డకు చెందిన కిరాయి హంతకులు ముగ్గుర్ని పోలీసులు పట్టుకున్నారు. కడప జిల్లా మైదుకూరుకు చెందిన వీరారెడ్డి అనే ముఠానాయకుడ్ని హతమార్చడానికి వారక్కడ కాపు కాస్తుండినారట. వీరారెడ్డి, డిసిపల్లెకు చెందిన ఒక హత్య కేసులో సాక్ష్యం చెప్పడానికి కోర్టుకు రావలసి వుండింది. కానీ ఎందువల్లో రాలేదు. అయితే మిగతా సాక్షులలో ఒకరు ఈ కిరాయి హంతకులను గుర్తించి రహస్యంగా పోలీసుకు ఫిర్యాదు చేశారు. పోలీసు పథకం ప్రకారం కోర్టు ఆవరణ నంతటినీ చుట్టుముట్టి ఒక్కసారిగా దాడిచేసే సరికి ముగ్గురు దొరికారు;

కొరవ 7వ పేజీలో



మా బావ

పులకం లక్ష్మీనారాయణ రెడ్డి గారు

14.9.94 తేది చీరాలలో మరణించినారు. బంధు మిత్రులు తెలియ గోరుతాము.

ఓ. అబ్బాయిరెడ్డి

అడ్వొకేట్, నెల్లూరు



సంతాపం...



మాకు అత్యంత ఆప్తుడు, చిన్న నాటి మిత్రుడు

కె.ఎస్. సుబ్రహ్మణ్యం నాయుడు

అకాల మరణం మాకు తీరని లోటు ఆయన ఆత్మకు చిరశాంతిని కలుగ జేయమని భగవంతుని ప్రార్థిస్తూ వారి కుటుంబానికి మా సానుభూతి తెలియ జేస్తున్నాము.

కలవకూరు చంద్రశేఖర రెడ్డి

(కె.వి.ఆర్.)

## తస్మాత్ జాగ్రత్త

మొదటి పేజీ కొరవ

వారిగా అవకాశం ఇవ్వలేదు. నెల్లూరు జిల్లాలో కాంగ్రెస్ పార్టీ ఎప్పుడూ సామాన్య జనానికి చేరువైన నాయకులు, కుటుంబాల చేతిలోనే మసలింది. ధనలక్ష్మి కాలియందెల రవళికి ఏనాడూ మురిసి, మాయలో పడలేదు.

1978 లో విఫన ఇందిరా ప్రభంజనం, చైతన్య వంతమైన రాజకీయ వాదిగా రంగం పైకి దూసుకొని వచ్చిన నేదురుమల్లి జనార్ధన రెడ్డి నాయకత్వాలతో ఒక్కసారిగా జిల్లాలో అరా కొరా మిగిలిన ధనికులు, కుటుంబ గుత్తాధిపత్యాలు తుడిచి పెట్టుక పోయాయి. అనాటి వరకు జిల్లాను శాసించిన ఆనం, నల్లపరెడ్ల ప్రాభవం అంతరించి పోయింది. ఆర్‌డిఆర్, గునుపాటి వంటి వారు ప్రజల ఆగ్రహానికి గురయ్యారు. ఆ ఎన్నికలలో గునుపాటి రామచంద్రా రెడ్డి గారు ద్రవ్యాన్ని ద్రవం వలె పారించినా, ఆయన పెట్టిన పలావు తిని, ఆయనిచ్చిన ట్రాక్టర్‌లో వెళ్లి, సిపి శేషారెడ్డి వంటి సామాన్యుడికి ఓట్లేసి గెల్పించారు ప్రజలు.

ఆ ప్రజా సాన్నిహిత్యమే అధికారంలో వున్నా, లేకున్నా ఈనాటికీ జిల్లాలో కాంగ్రెస్ పార్టీని బ్రతికిస్తున్నది. ఆ దగ్గరి చుట్టరికంతోనే వేలాది మంది కార్యకర్తలు గ్రామ గ్రామాన కాంగ్రెస్‌ను కనిపెట్టుకొని వుండడానికి కారణమైంది. ఉజ్వలమైన ఈ చరిత్రను ఇప్పటి నాయకులు విస్మరిస్తున్నారు. సిరి గల్గిన వారి మోజులో పడి పార్టీని పెడదారిలో నడిపించ డానికి చూస్తున్నారు. ఆందోళన కరంగా, బాధాకరంగా వుంది పరిస్థితి.

జిల్లా కాంగ్రెస్ పార్టీలో మాగుంట కుటుంబీకుల జోక్యం, పెత్తనం అమలు జరుగుతున్న తీరు చూస్తే ఈ బాధ వ్యక్తం చేయక తప్పడం లేదు. సుబ్బరామ రెడ్డి గారు రాజకీయాలలోకి వచ్చినప్పుడు అందరూ హార్దికంగా స్వాగతించారు. ఉత్సాహం ఉరకలు వేసే వయస్సులో వుండడం, రాజకీయాల నుంచి లబ్ధి పొంద వలసిన అవసరం లేని స్థితి పరుడు కావడంతో తన సమయాన్ని, పలుకుబడిని, ఉదార స్వభావాన్ని ప్రజల మేలుకు ఉపయోగ పెట్ట గలరనే భావంతో అందరూ ఆనందంగా ఎదురు కోలు పల్కారు. కానీ ఈ మూడేళ్లలో ఆ ఆశలేవీ నెరవేర లేదు సరి కదా - కాంగ్రెస్ పార్టీని సామాన్యుల నుంచి దూరం చేసి సంపన్నుల లోగిళ్లలో సేవకు వినియోగ పెట్టే ప్రయత్నం జరుగుతున్నది.

ఏనాడూ ప్రజలకు చేరువ కాలేని, ప్రజలతో కలసి మెలసి తిరగలేని సంపన్న కుటుంబాల వారు, ఫ్యూడల్ మనస్తత్వం కల్గిన వారు ముందుకు వచ్చేస్తున్నారు. జిల్లాలోని అధికార యంత్రాంగం యావత్తూ వారి కను సన్నలలో మసలు తున్నది. పోలీసు శాఖది మరీ హేయమైన దుర్గతి. జిల్లాకు ఐజి వచ్చినా, డిఐజి వచ్చినా ప్రభుత్వ గెస్ట్ హౌస్‌లో దిగడం, పది మంది సగటు మనుషులతో మాట్లాడడం మర్చి పోయారు. రైల్వే స్టేషన్ నుంచె కార్లు నేరుగా ప్రైవేటు అతిథి గృహాలకు చేరు కుంటున్నాయి. ఆర్డీలిచ్చే వారి సంగతి అవతల పెట్టండి - ఎమ్మెల్యేలు వారిని కలసి మాట్లాడాలన్నా కుదరడం లేదు. ఎంతో మంది అధికార్లు నెల్లూరుకు వచ్చేది, వెళ్లేది కూడా ఎమ్మెల్యేలకు తెలియడం లేదు. ఉన్నతా ధికారులు విలాస మందిరాల మోజులో పడి, ఆ మత్తులో తూగుతుంటే, క్రింది ఉద్యోగులు ఆ అతిథి గృహ యజమానులకు ఊడిగం చేయవలసిన దుర్గతి కల్గుతున్నది; వారి టెలిఫోన్ ఆదేశం వస్తే ఏ తప్పూ చేయక పోయినా పోలీస్ స్టేషన్లలో వీపులు పగిలి పోతున్నాయి; వారికి గిట్టకుంటే హత్యకేసుల్లో ముద్దాయిలుగా మార వలసి వస్తున్నది; వారికి అనుకూలమైతే రౌడీషీటర్లకూ పోలీసులు దండాలు పెట్టాల్సి వస్తున్నది.

ఒక్క పోలీసే కాదు - మునిసిపాలిటీ, రెవిన్యూ, ఎక్సైజ్, ఎలక్ట్రిసిటీన్ను వాణిజ్య పనులు తదితర శాఖలలో కూడా మామూలు మనుషులకు, సాదా సీదా ఎమ్మెల్యేలకు చిల్లి కాణీ విలువ వుండడం లేదు. జిల్లా అధికార యంత్రాంగం ఇంత దిగజారి సంపన్నుల అడుగులకు మడుగు లొత్తే పరిస్థితి ఇంతకు ముందెప్పుడూ లేదు; ఇక ముందు మారదేమో.

రేపటి అసెంబ్లీ ఎన్నికలకు సుబ్బరామరెడ్డిగారి వర్గం నుంచి వినిపిస్తున్న అభ్యర్థుల పేర్లన్నీ, ధనం అర్హతగా కల్గినవే. ముఖ్యమంత్రితో వారికున్న సాన్నిహిత్యం ఫలించి ఇటువంటి వారు అభ్యర్థులుగా ముందుకు వస్తే పార్టీ పరిస్థితి ఏమికావాలి?

కాంగ్రెస్ ధనస్వాములకు దత్తపుత్రిక కావడం ప్రజలు సహించరు. జీవిత పర్యంతం పార్టీని కనిపెట్టుకొన్న వారిని విస్మరించి, కరెన్సీ మూటలు కల్గిన వారే ఆఖరి నిముషంలో ఆప్త బంధువులుగా భావింపబడితే ఇక పార్టీకి కార్యకర్తలు ఎవరు మిగుల్తారు? సాధారణంగా ఇటువంటి వ్యాపారుల దృష్టి తమ లాభాలపైన, తమ ప్రయోజనాల పైనా వుంటుంది తప్ప, ప్రజా సమస్యలపై వుండదు. అధికార యంత్రాంగాన్ని తమ పనులకోసం వాడుకోవడం లోనే వారికి సమయం చాలదు.

కాంగ్రెస్ పార్టీకి ఇటువంటి డబ్బున్న మారాజులు వద్దు. ప్రజలతో కలసి మెలసి పని చేసే వారు కావాలి; ప్రజలకు అందుబాటులో వుండేవారు కావాలి. అందరు నాయకులూ కలసి కుర్చుని ఆలోచించి ధనస్వాముల నుంచి ఎదురయ్యే ప్రమాదాన్ని ముందుగానే నివారించాలన్నది కార్యకర్తలందరి అభిమతం.

అమెరికా
2 పేజీ కొరవ

పట్టింది. సాదరంగా ఆహ్వానించింది. వారి తెలివిని తాను వాడుకున్నది; తన సౌభాగ్యాన్ని వారికి పంచి పెట్టింది.

అమెరికాలో వున్న ఆంధ్రులలో డాక్టర్లు అధిక పరంగా ప్రథమ స్థానంలో వున్నారు. పోస్ట్ గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన డాక్టర్ కనీసం ఏడాదికి 75 డాలర్ల జీతంతో ఉద్యోగం సంపాదించుకో గలుగుతున్నారు. సర్వీసు వున్న డాక్టర్లు, స్వంత ప్రాక్టీసు కల్గిన వారు 10 లక్షల డాలర్లు (దాదాపు 3 కోట్ల రూపాయలు) వరకు ఆర్జిస్తున్నారు. ఇంజనీర్లకు అంత సంపాదన లేదు. వారి జీతం 50, 60 వేల డాలర్లు దాటడం లేదు. ఇటీవల కాలంలో అమెరికులు వచ్చిన ఇంజనీర్లకు పెద్దగా ఉపాధి అవకాశాలు లభించడం లేదు. కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ నిపుణులకు మాత్రం డిమాండ్ వుంది. తక్కిన రంగాలలోని వారు ఉద్యోగం కోసం వెతుకు లాడాల్సిన పరిస్థితి.

కొరవ పై వారం

\- దేవేంద్ర

## సణుగుడు

4 పేజీ కొరవ

త్రాగుడు చిన్న సమస్యకాదు. నిన్నా, మొన్న పుట్టిన విషపురుగు కాదు. వేదాల కాలం నుంచి వేలవేల సంవత్సరాల నుంచి మానవుడు ఏదో ఒక మత్తును ఆశ్రయించే బ్రతుకుతున్నాడు. ఆనందంకోసం, విలాసం కోసం, విషాదాలను మర్చిపోవడం కోసం, శారీరక శ్రమనుంచి మరుపు పొందడం కోసం, మానసిక అశాంతినుంచి మైమరుపు సాధించడం కోసం మత్తును ఒక సాధనంగా భావిస్తూ వస్తున్నాడు. మానవ చరిత్రలో సురాపానం ఒక అంతర్భాగం. కానీ ఇటీవల కాలం వరకు అదొక సాంఘిక సమస్యగా, కుటుంబ పీడగా పరిగణింప బడలేదు. నాగరికత, అందులోనూ పారిశ్రామిక నాగరికత వికటించి మానవ బలహీనతలను వ్యాపారంగా మల్చుకునే దుష్ట సంస్కృతి ప్రబలిన తర్వాతనే త్రాగడం ఒక వ్యసనంగా మారింది; మత్తుకు మనిషిని బానిసగా మార్చింది; కుటుంబాల ఆర్థిక పరిపుష్టిని శిథిలం చేసే చెదపురుగుగా రూపాంతరం చెందింది. ఎందరు ప్రవక్తలు, ఎందరు సంస్కర్తలు, ఎందరు ఆధ్యాత్మిక పురుషులు, రుషితుల్యులు, ఎందరు మహాత్ములు ఈ త్రాగుడును మాన్పించడానికి ప్రయత్నించారు? ఎన్నెన్ని చైతన్య ఉద్యమాలు, ఎన్నెన్ని సంస్కరణో ద్యమాలు, ఎన్నెన్ని ప్రబోధాలు చూసింది, అనుభవించింది భారతీయ చరిత్ర పుస్తకం? కానీ మానవ మనస్సు లోపలి పొరలలో నిక్షిప్తమైవున్న ఆ మహమ్మారిని ఏ ఉద్యమమూ పారద్రోలలేక పోయింది. గౌతమ బుద్ధుడి వల్లా కాలేదు, గాంధీ మహాత్ముడి వల్లా కాలేదు. కల్లు మానమని ఇల్లిల్లు తిరిగి చెవిలో పోరిన కాంగ్రెస్ ప్రభుత్వాలే- తర్వాత తర్వాత కల్లుకంటె ఘాటైన సారాను కనిపెట్టి, సర్కారు ముద్ర వేసి, సాదాజనాన్ని మత్తులో జోకొట్టాయి; విస్కీ, బ్రాండీలకు లైసెన్సులిచ్చి వచ్చే పైసల వైపు చూసుకొని మురిసిపోయాయి. ప్రొహిబిషన్ ప్రయత్నాలు 'కల్తీ' చావులుగా విషమించడంతో కల్లుసారా ఆదాయంతో బియ్యం, గోధుమలు పంచడం నేర్చుకున్నాయి. ఇదంతా చరిత్ర.

ఇప్పటికిప్పుడు బ్రాందీ అంగళ్లు మూయించి నంత, మాత్రాన జనం నుంచి త్రాగుడు వ్యసనం అదృశ్యమైపోదు. అంగళ్ళను ముందునుంచి మూయిస్తే, వెనుకనుంచి అమ్మకాలు జరుగుతాయి. దొంగచాటు వ్యాపారంలో కల్తీ బ్రాందీల విషం చేటు చేసుకుంటుంది. అది ఇంకా ప్రమాదకరం. అందువల్ల ఆందోళన కారుల దృష్టి త్రాగుబోతుల మా... పరివర్తన దిశగా ... త్రాగేవారిలో త్రాగుబోతుల ... తక్కువ. బ్రాందీ అంగళ్ల సంఖ్య బాగా తగ్గించి, ప్రతి అంగడి ఎదుటా త్రాగడం మానుకోమని చెప్పే దళం ఒకటి కాపుకాస్తే చాలా మంది ఆ వ్యసనానికి దూరమైపోతారు. బ్రాందీ అమ్మకాల ప్రచారం, ప్రకటనలు, హోర్డింగులు నివారిస్తే కొత్తవారు దానివైపు ఆకర్షింపబడడం తగ్గుతుంది. త్రాగుబోతులలో నిజంగా అది మానాలని అభిలాష పరిశోధనకోసం డీఅడిక్షన్ సెంటర్లు అందుబాటు ప్రదేశాలలో, చవక ధరలలో నెలకొల్పాలి. త్రాగుడు వ్యసనంగా మారిన తర్వాత, దానిని వదులుకోవడం చాలాకష్టం. నిదానంగా, శాస్త్రీయ పరమైన వైద్య విధానంతో దాన్ని మాన్పించాలే తప్ప, అంగళ్లు మూయించినంత మాత్రాన ప్రయోజనం వుండదు. ఉద్యమ నిర్వాహకుడు శ్రీ గండవరపు సేతురామిరెడ్డిగారికి ఈ విషయాలపై సమగ్ర అవగాహన వుంది. కలెక్టర్ వంటి వారినుంచి తగిన ప్రోత్సాహం వుంటే ఉద్యమాన్ని సవ్యదిశలో నడిపించే వీలుంటుంది. కలెక్టర్ గారికి ఉద్యమ నిర్వాహకులకంటే అధికమైన చిత్తశుద్ధి, అంకిత భావం వున్నాయి ఈ విషయంలో. సారా ఉద్యమం వలె బ్రాందీ ఉద్యమమూ సాఫల్యం చెంది నెల్లూరు మహిళలు మరొకసారి అంతర్జాతీయ గుర్తింపు పొందుతారని ఆశిద్దాం!

## నెల్లూరు ముచ్చట్లు

ఆరవ పేజీ కొరవ

తక్కినవారు పారిపోయారు. వారి నుంచి బాంబులు, కత్తులు స్వాధీనం చేసుకున్నారు. ఎట్టయితేనేమి పోలీసు అప్రమత్తతతో ఒక పెద్ద మారణకాండ నివారింప బడింది. అందుకు వారు అభినందనీయులు.

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

O.S. No. 89 of 1993

Between:

M/s. Shriram Chits & Invest (P) Ltd., Nellore, rep by its Branch Manager - Plaintiff

and

1. Sirusuru Subrahmanyam & 3 others - Defendants

3. Vuyyala Subrahmanyam
S/o. Venkata Swamy
P.C. No. 1130,
S.V. University P.S.;
Tirupathi - 517 502.

### నోటీసు

పై వాది మీ పై పై దావా O.S. No. 89 / 1993 దావా పరిహారములను కోరుచూ దాఖలు చేసి ఉన్నారు. ఆ దావా మీ నోటీసు నిమిత్తమై 19.9.94 తేది వాయిదా వేయబడి వున్నది. కాన ఆ దినము మీరు ఉదయం 10.30 గంటలకు హాజరై ఆక్షేపణలు తెలుపు కొనవలయును. లేనిచో మీ పరోక్షమున తీర్మానించ బడును.

పి. సురేంద్ర, పి. వేణుగోపాల్
వాది తరపు అడ్వకేట్స్

## కృతజ్ఞతాంజలి

పి.సి.సి. ప్రెసిడెంట్ శ్రీ మజ్జి తులసీదాస్ నేతృత్వంలో పంచాయితీ రాజ్ అభియాన్ కార్యవర్గ సభ్యులుగా మేము నియమింప బడిన శుభసందర్భంలో ఛైర్మన్ శ్రీ నాగబంది సత్యనారాయణ గారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు అందజేస్తున్నాము.



ఎస్. సత్యనారాయణ



పి. అరుణమ్మ
కన్వీనర్



పి. సరోజనమ్మ
జాయింట్ కన్వీనర్



డి. విజయమ్మ
ఎగ్జిక్యూటివ్ మెంబరు

## జిల్లావార్తలు

జరవ పేజీ కొరవ

సృష్టించి, దాన్ని మళ్లీ యథా స్థానానికి చేర్చారు. బంతి వున్న స్థల వివాదాన్ని ప్రస్తుతం స్థానిక నాయకులతో ఏర్పడిన ఒక కమిటీ కూడా పరిశీలిస్తున్నది. ప్రభుత్వ స్థలంలో బంతి తీయకుండా నాయకులు; తీసేందుకు ప్రయత్నిస్తున్న అధికారుల్లో ఎవరు విజయం సాధిస్తారో వేచి చూద్దాం.

### అధికారుల నిర్లక్ష్యం- ప్రజలకు ప్రాణ సంకటం

ప్రజల ప్రాణాలంటే రోడ్డు భవనాల శాఖాధి కారులకు మరీ చులకన; అందువల్లే అధ్వాన్నపు రోడ్ల ప్రయాణంలో ఎందరో ప్రాణాలు కోల్పో తుంటారు. మామూలు రోడ్ల ప్రయాణం కన్నా ఘాట్ రోడ్ ప్రయాణం ప్రమాద భరితమని అందరికీ తెలుసు. అందులోనూ రాపూరు - చిట్వేలి ఘాట్ రోడ్ గూర్చి ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. కాని ఈ రోడ్‌లో అనవసరమైన చోట సైడు గోడలు కట్టడం మర్చి పోయారు ఘనత వహించిన మన అధికారులు. ఈ ఘాట్ రోడ్డు కడప జిల్లా వాసులు మన జిల్లాకు రావడానికి మార్గ మైనందున నిరంతరం రద్దీగా వుంటుంది. 48 కిలో మీటరు రాయి నుండి 50 కిలో మీటరు వరకు మూడు ప్రమాద భరితమైన మలుపు లున్నాయి. ఇక్కడ 'నామ్ కే వాస్తే' కట్టిన పిట్ట గోడలు ఎప్పుడో కూలి పోయాయి. ఈ మలుపులు వస్తూంటే చాలు ప్రయాణీకులు అరచేతిలో ప్రాణాలు పట్టుకొని బిక్కు బిక్కు మంటుంటారు. ఇటీవల ఈ మలుపులోనే ఒక ఆర్టీసీ బస్ తిరగ లేక లోయలో పడినా, అదృష్టవశాత్తు ప్రయాణీకులను మృత్యువు కబళించ లేదు. అధికారులు ఈ మలుపుల దగ్గర రోడ్డు వెడల్పు చేయించి, గట్టి పిట్ట గోడలు కట్టించ కుంటే మరెన్ని ప్రమాదాలకు బాధ్యులవు తారో లెక్కగట్టలేం!

### అల్లూరు చదరంగం పోటీలు

ఆదర్శ ఉపాధ్యాయులుగా పేరు గాంచి అకాల మృత్యువు పాలైన ఆర్. జయ రామయ్య, కె. వెంకట సుశీల స్మారకార్థం అల్లూరులో చదరంగం పోటీలు నిర్వహిస్తున్నారు. పోటీలు అక్టోబర్ 2 తేది జరుగుతాయి. మండల స్థాయిలో జరి, ఈ పోటీని సీనియర్స్, జూనియర్ స్థాయిలుగా విభజించారు. స్త్రీ, పురుషులకు వేరు వేరుగా పోటీలు జరుగు తాయి. ఉత్సాహ వంతులు ఎంట్రీలను 25 తేదీ లోగా నిర్వాహకులకు పంపాలి. 316, 216, 116 ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా వుంటాయి. ఇతర వివరాలకు మెయిన్ రోడ్‌లోని మురళీకృష్ణ బుక్ స్టాల్‌లో సంప్రదించ వచ్చు.

### గూడూరులో తరచూ విద్యుత్ కోత

గూడూరులో తరచూ సంభవిస్తున్న విద్యుత్ కోత వేసవి రోజులను గుర్తుకు తెస్తున్నది. హెల్పర్లు, లైన్‌మెన్‌లు దర్జా బాబుల్లై పోయారు. రోజూ ఏదో పర్యాయాలకు పైగా విద్యుత్ కోత ఏర్పడుతున్నా పట్టించు కోవడం లేదు. ప్రజలు పడుతున్న కష్టాలను వున్నతాధి కార్లయినా గమనించి క్రింది అధికారుల పై తగిన చర్యలు తీసుకొని విద్యుత్ కోత లేకుండా చేయాల్సి వుంది.

### వెన్నారాయుని పాళెంలో వారానికొకసారి వైద్యం

వెన్నారాయుని పాళెంలో ప్రాథమిక ఆరోగ్య ఉప కేంద్రానికి వారానికొక సారి డాక్టర్ వచ్చి గ్రామస్తులకు వైద్య సేవల నందిస్తారు; ఎల్లప్పుడూ అందుబాటులో వుండేందుకు ఒక ఎ.ఎన్.ఎం. పోస్టు కూడా మంజూరయ్యింది. వైద్య సౌకర్యం లేక గ్రామస్తులు పడుతున్న అవస్థలను హైదరాబాద్‌లో స్థిరపడ్డ ఆ గ్రామస్తుడు ప్రముఖ న్యాయవాది ఎం.వి. రమణా రెడ్డి జిల్లా వైద్యాధికారికి రాసిన లేఖకు స్పందించి ఈ ఏర్పాట్లు జరిగాయి. వారంలో ఒక రోజు కోవూరు పల్లి హాస్పిటల్ నుండి వచ్చి డాక్టర్ గ్రామస్తులను పరీక్షిస్తారు. గ్రామంలో ఒక ఎ.ఎన్.ఎం. కూడా ఇక నుండి అందుబాటులో వుంటుంది. దసరా సెలవుల్లో గ్రామంలో పెద్ద ఎత్తున వైద్య శిబిరానికి రమణా రెడ్డి పథకం రచించి వున్నారు. ఎక్కడున్నా గ్రామం పైన అనురక్తి వీడని వ్యక్తుల వల్ల నిరంతరం ఆ గ్రామాలకు మేలు జరుగుతూనే వుంటుంది.

### రాపూరులో దోమల బెడద

రాపూరులో దోమల బెడద ఇటీవల ఎక్కు వయ్యింది. దీనివల్ల ప్రజలకు రాత్రుళ్లు జాగారం తప్పడం లేదు. మేజర్ పంచాయితీ అయినా డ్రైనేజీలు నిర్మించడానికి అధికార వర్గం ప్రయత్నించక పోవడం వల్ల ఈ దుస్థితి దాపురించింది. ఇళ్లలోని మురికి నీరంతా రోడ్ల లోకి పారి మురికి కూపాలుగా మారి ప్రత్యక్ష దోమల ఉత్పత్తి కేంద్రాల వుతున్నాయి. ఇకనైనా ప్రజారోగ్య సిబ్బంది ప్రజలు పడుతున్న ఇబ్బందికి స్పందించి తగిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

### కలిచేడు గనుల భద్రతా వారోత్సవాలు

కలిచేడులో 32వ గనుల భద్రతా వారోత్సవాలు 11 వ తేదీన జరిగాయి. దక్షిణ ప్రాంత గనుల శాఖ డిప్యూటీ డైరక్టర్ వి. మహాజన్ ముఖ్య అతిథిగా విచ్చేయగా, విద్యుత్ శాఖ ఎస్.ఇ. టి. రామలింగా రెడ్డి, గూడూరు మెజిస్ట్రేట్ పార్థసారథి, సబ్ జడ్జి రామ చంద్రా రెడ్డి, మునిసిపల్ కమీషనర్ బి. కృష్ణయ్య వేదిక నలంకరించారు. మహాజన్ మాట్లాడుతూ మైకా గనుల్లో ప్రమాదాలు తగ్గించేందుకు మేనేజర్లు, కార్మికులు కృషి చేయాలన్నారు. మైనింగ్ ఏరియాకు నిరంతరం విద్యుత్ సరఫరా అయ్యేలాట్లు చూడ గలనని విద్యుత్ ఎస్.ఇ. హామీ ఇచ్చారు. ఈసారి ఉత్తమ గనులుగా కలిచేడులోని కె.ఎస్.ఆర్. మైకా మైన్ సీతారామ మైకా మైన్. ఊటుకూరు మీనాక్షి సుందరం మైన్లను ఎంపిక చేశారు. ఉత్తమ మేనేజరుగా సీతారామ మైకా మేనేజర్ సి.హెచ్. పోలిరెడ్డిని, సూపర్‌వైజర్‌గా వి. కృష్ణయ్యను ఎంపిక చేసారు. గనుల వారోత్సవాల కమిటీ కార్యదర్శి బి. పాపయ్య చివరన వందనాలు చెప్పారు.

### గూడూరు నేత్ర దాతలు సంస్థ రికార్డు!

గత సంవత్సరం డిశంబర్‌లో ప్రారంభించ బడ్డ గూడూరు నేత్ర దాతల సంస్థ అరుదైన రికార్డును చేజిక్కించు కుంది. ఈ నెల 4 తేదీ మరణించిన రిటైర్డ్ టీచర్ చీకోలు వెంకట కృష్ణయ్య నేత్రాలతో ఇప్పటి వరకు ఏర్పాటు చేయబడిన స్వచ్ఛంద సంస్థలలో తొమ్మిది నెలల్లో యిన్ని నేత్ర స్వీకారాలు ఎక్కడా జరగ లేదంటున్నారు సంస్థ కార్యదర్శి పి. రాజారాం రెడ్డి, ప్రముఖ డాక్టర్ సి.ఆర్. రెడ్డి ఈ నేత్ర దాతల సంస్థకు అధ్యక్షునిగా వ్యవహరిస్తున్నారు.

5 పేజీ కొరవ

పరుగెత్తుకొని వస్తున్న నక్సలైట్లను చూసి కంపా ప్రసాద్ ఒక రౌండు కాల్పులు కూడా జరిపాడట. కాని వారు పర్వేపల్లి కాలువలోకి దూకి, నీళ్లలో ఈది, అవతలి గట్టు ఎక్కి, పొలాల్లో, చీకటిలో కలిసి పోయారు.

ఈ సమాచారం టౌనంతా వైర్‌లెస్ సెట్ల ద్వారా ప్రసారమై పోయింది. ఎక్కడి పోలీసులను అక్కడ అలర్ట్ చేశారు. సంఘటన జరిగిన కొద్ది సేపటి తర్వాత ఫత్తేఖాన్ పేట సెంటర్‌లో ఇద్దరు వ్యక్తులు హడావుడిగా టౌన బస్ ఎక్కడం మఫ్టీలో వున్న కానిస్టేబిళ్లు గమనించారు. అనుమానం వచ్చి వారూ ఆ బస్ ఎక్కారట. లోపలకు వెళ్లి చూస్తే వారి కాళ్లకు, చొక్కాలకు బురద అంటి వుంది. బిత్తర బిత్తరగా కన్పించారట. కానిస్టేబిళ్లు వారిద్దరినీ నిర్బంధించి, క్రిందకు దించేశారు. తర్వాత విచారణలో వీరూ హంతకుల ముఠాలోని వారేనని తేలింది. పోలీసులు క్షణాలలో అప్రమత్తులై సంఘటన స్థలానికి చేరుకోవడం, టౌనంతా చుట్టుముట్టి గాలించడం అభినందనీయం.

ఇంతకూ నక్సలైట్లు నాయుడును ఎందుకు చంపినట్లు? ఏడాది క్రితం సుబ్రహ్మణ్యం నాయుడు శ్రీ కాళహస్తి దగ్గర వరదయ్య పాళెంలో తెలుగు గంగ కాలువ కాంట్రాక్టు పని చేస్తుండగా స్థానిక నక్సలైట్లు చందాల కోసం వచ్చారట. అప్పుడు వారు ఆ చుట్టు ప్రక్కల కాంట్రాక్టర్లందరి నుంచీ చందాలు దండారు. వీరిట్లా చందాలకు వచ్చే సమయంలో పోలీసులు పసిగట్టి, ముగ్గురుని అరెస్ట్ చేశారు. సుబ్రహ్మణ్యం నాయుడే సమాచార మందజేసి తమ వారిని పట్టించాడని వారి అనుమానం. అది మనసులో పెట్టుకొని, నాయుడును హతమార్చారు. హత్యకు వారం రోజుల ముందే భూపతి దానికి సంబంధించిన బిడుగురు నెల్లూరు వచ్చారట. మూడు లాడ్జిలలో విడివిడిగా ఒక్కొక్క రోజు లెక్కన మారుతూ కాపు కాశారు. నాయుడు కదలికలు అధ్యయనం చేసి పథకం ప్రకారం చంపేశారు. టౌన్ నడి మధ్యలో, పోలీస్ స్టేషన్ ప్రక్కగా హత్యకు ప్లాన్ చేయడంలోనే వారి సాహసం వ్యక్తమౌతున్నది. ప్రక్కనే చర్చి గ్రౌండ్ వుండడంతో తప్పించు కోవడం సులభమని ఇంటి దగ్గర కాకుండా, ఆఫీసు దగ్గర హత్యకు ప్లాన్ చేశారట.

దొరికిన హంతకు లిద్దరూ- సాగర్ అలియాస్ తిరుమల రావు, నాద మునిరెడ్డి కాళంగి దళ కమాండర్ భూపతి క్రింద పనిచేసేవారు. హత్యలో వీరు నేరుగా పాలు పంచుకోలేదు. రోడ్డుకు అటు ఇటు నిలబడి సెంట్రీ డ్యూటీ చేశారట. అరెస్ట్ చేసిన ఈ ఇద్దరినీ వెంటనే కోర్టులో హాజరు పర్చాల్సిందిగా డిమాండ్ చేస్తూ భూపతి తిరుపతిలో 15 తేది ఒక పత్రికా ప్రకటన విడుదల చేశాడు. నాయుడును చంపింది తామేనని అతనా ప్రకటనలో చెప్పుకున్నాడు.

నక్సలైట్లలో ఇంతటి నర రూప రాక్షసత్వం ఎందుకో అర్థం కాదు. చావొక్కటే సమస్యకు పరిష్కారమా? అందుకు వేరె మార్గాలు లేవా?

నెల్లూరు టౌన్‌లో నక్సలైట్లు చేసిన మూడవ హత్య ఇది. పన్నెండేళ్ల క్రితం అల్లూరు, కాటంరెడ్డి ఆదినారాయణ రెడ్డిని మద్రాసు బస్టాండు దగ్గర ఆయన ఇంటిలోనే చంపారు; ఆరేడేళ్ల క్రితం సిపిఎం నాయకుడు మాలకొండా రెడ్డిని మునిసిపల్ ఆఫీసు ఎదాళం నరికేశారు. ఇది మూడవది.

సుబ్రహ్మణ్యం నాయుడు - నెల్లూరు సెంట్రల్ స్కూల్ వ్యవస్థాపకుడు శ్రీ కె.ఎస్. రావు తమ్ముడు. ఆర్థికంగా ఇప్పుడిప్పుడే వృద్ధిలోకి వస్తుండినాడు. ఆయనకు భార్య, ముగ్గురు పిల్లలు వున్నారు. ఆ కుటుంబానికి మా సానుభూతి.

### ఆత్మవంచన

డి.వి.వి. ప్రసాద్.

కన్నకూతురు జన్మను కానులేక
బాధ దీర లేదు నెమరి బట్టలేదు
కొమరు బిడ్డకి లక్ష కట్నమడు గంగ
అత్త యమును బోయను చింతలేదు.

మగువ జాతి సుద్గతి జేతు మన్న మనిషి
మరులు గొన్నదా కొమరుని మనసు జంపు
కులపు గోడలు కట్నపు వలలు బెంచు
మానవ మృగారణ్యంబు మనగ లేము.

వారు దుష్టుల వ్వారు చోరు లతలేము
మూర్ఖ దాతంత సత్యవ్రతుండ నియును
తెలిసి దెలిసి జేజేలు బలుక నేల
ధనము గల్గిన సద్గుణ ధనులు వౌర!

### పరిశీలకులు

2 పేజీ కొరవ

వుంటున్న ఎంపి ద్రోణంరాజుతో అమీతుమీ తేల్చుకోవడానికి మంత్రి సత్యారావు రాజీనామాను నిముషాల మీద ఆమోదించారు. ఉత్తరాంధ్రలో ద్రోణంరాజు వ్యతిరేకుల్ని ప్రోత్సహిస్తూ అక్కడ పార్టీలో చిచ్చు పెట్టాడు. సొంత జిల్లా కర్నూలులో తన ప్రత్యర్థి అయిన కె.ఇ. కృష్ణమూర్తి పార్టీ వదలి వెళ్లే పరిస్థితి కల్పించాడు. దానితో కె.ఇ. ఇటీవలనే తెలుగు దేశం అధినేతను కలిసి దేశం తీర్థం తీసుకు నేందుకు రంగం సిద్ధం చేసుకొన్నాడు. ఇప్పటికే ఆత్మకూరు ఎమ్మెల్యే బుడ్డా వెంగళ రెడ్డి కాంగ్రెస్‌ను వదలి దేశంలోకి ఫిరాయించేట్లు చేశాడు. మాజీ ముఖ్యమంత్రి జనార్ధన రెడ్డి జిల్లాలో వేలు పెట్టి గెలుకుతున్న ముఖ్యమంత్రి ఇప్పుడు అమాంతంగా జనార్ధన రెడ్డి పై పగ తీర్చు కునేందుకు మాగుంట ఆసరాతో కుళ్లు రాజకీయం నడుపుతున్నాడు. జనార్ధన రెడ్డి వర్గీయుల పదవీ కాలం ముగియటంతో ఆ పదవుల్లో మాగుంట సిఫార్సీయుల్ని నియమిస్తూ జనార్ధన్ రెడ్డికి సవాల్ విసుర్తున్నాడు.

# సెన్సార్‌ను తిట్టడం ఫ్యాషన్

సెన్సార్ బోర్డు సరికొత్త విధానాన్ని విమర్శించడం నేడు సినిమా రంగంలో కొందరికి ఫ్యాషనై పోయింది. పైగా, 'మన సంస్కృతిని కాపాడ కోవాలనుకునే తలమాసిన వాళ్ళను ముందుగా స్టార్ వగైరా శాటిలైట్ టి.వి. లలో వచ్చే సెక్సుకు అనకట్ట వేయమనండి'' అనడం కూడా ప్రతి వారికీ మామూలై పోయింది. ఇలా సమర్థించుకుంటూనే మరో వంక తెలుగు చిత్రాలలో అశ్లీల సంభాషణలను ఎంతగా పెడుకుంటూ పోతున్నారో చూడండి.

'నీకు 16 నాకు 18' చిత్రం

మల్లికార్జునరావుతో గిరిబాబు : రాత్రి శోభనం గదిలో నా భార్యతో ఏం జరిగిందో తెల్సా?

తండ్రితో అమిాలన: మా ఫ్రెండ్ నన్ను శోభనం వరకు

కొరవ 11వ పేజీలో

# రాజశ్రీలోటు వెన్నెలకంటి తీరుస్తాడా?

డబ్బింగ్ చిత్రాల రచయిత రాజశ్రీ కన్నుమూయడంతో అనేక డబ్బింగ్ చిత్రాల స్క్రిప్టు బాధ్యత నెల్లూరీయుడు వెన్నెలకంటి మీద పడింది. ఈయన కిప్పుడు ఊపిరి సల్పడానికి కూడా వ్యవధి లేకుండా ఉంది. రాజశ్రీ లేని కొరతను ఈయన తీర్చగలడని అందరి విశ్వాసం కూడాను!



ఖైదీ నంబర్ వన్ చిత్రంలో సుకన్య

# శ్రీకృష్ణుడుగా బాలకృష్ణ

శ్రీకృష్ణుని పాత్ర ధరించాలని బాలకృష్ణ చిరకాలవాంఛ. భగవద్గీతలోని శ్రీకృష్ణత్వం ఆయన్ని బాల్యంలోనే ఎంతగానో ఆకట్టుకున్నదట. అంచేత బాపు దర్శకత్వంలో అంతర్జాతీయ మార్కెట్‌కు తగినట్లుగా 'భగవాన్ శ్రీకృష్ణ' చిత్రాన్ని భారీ ఎత్తున నిర్మించడానికి నిశ్చయించారు. స్క్రిప్ట్ వర్క్ ప్రారంభమైంది. త్వరలో సెట్స్‌కు వెళ్ళే బాపు రమణల సొంత చిత్రంలో శోభన్‌బాబు శ్రీకృష్ణుడుగా నటించబోయే వార్తను 'జమీన్‌రైతు' ఇదివరకే ప్రచురించింది.

## రాజకీయాలలో చిరంజీవి, జయప్రద

చిరంజీవి కాంగ్రెస్ (ఐ)లోనూ జయప్రద తెలుగు దేశంలోనూ చేరి, ఆయా పార్టీల ద్వారా ప్రచారం చేయడానికి పూనుకోవడం గురించే నేడు సినిమా రంగంలో అత్యంత ఆసక్తితో చర్చింపబడుతోంది. మోహన్‌బాబు తెలుగుదేశం సభ్యుడుగా ఇదివరకటి నుంచే ప్రచారం సాగిస్తున్న విషయం అందరూ ఎరిగినదే. ఈ తారల రాజకీయ రంగప్రవేశం తెలుగు సినిమా రంగంపై ఎటువంటి ప్రభావం చూపిస్తుందో వేచి చూడాలి.

# ఐదుకోట్ల పన్నుకు వసూలైందిఐదులక్షలే!

ముందుగా అనుమతి పొందకుండా అదనపు ఆటలు ప్రదర్శించడం, నిర్ణయించబడిన కెపాసిటీకి మించి ఎక్కువ కుర్చీలు వేయడం, పాత చిత్రాలని చెప్పి కొత్త చిత్రాలు ఆడించడం- ఈ విషయంలో థియేటర్ యజమానులతో ప్రభుత్వోద్యోగులు కుమ్మక్కయ్యే అవతకవల గురించి ఏ సినిమా పత్రికా వెలిబుచ్చడానికి సాహసించని రీతిలో 'జమీన్‌రైతు' ఈ అన్యాయాలను పదే పదే పేర్కొనడం వృథా పోలేదు. ఈ అక్రమాలను అరికట్టడానికి ఏ చిత్రం ఏ తారీఖున ప్రదర్శించిందీ తెలిపే రిజిస్టర్ ప్రతి థియేటర్‌లోనూ విధిగా ఉండాలనీ, ఆ మేరకు స్థానిక మునిసిపాలిటీ -లేదా గ్రామ పంచాయితీ నుంచి సర్టిఫికెట్ తీసుకుని రిజిస్టర్‌లో జతపరచాలనీ శాసన సభ అంచనాల కమిటీ ప్రభుత్వానికి సిఫారస్ చేసింది. కరీంనగర్‌లో 5 కోట్ల 86 లక్షల రూపాయలు వినోదపు పన్ను మూలంగా రావలసి ఉండగా 5లక్షల 94 వేల రూపాయలు మాత్రమే వసూలైన గుట్టురట్టైంది. మొత్తం మీద ప్రతి జిల్లాలోనూ ఇలాంటి పరిస్థితే నెలకొని ఉన్నందున థియేటర్ యజమానులతో కుమ్మక్కైన ప్రభుత్వోద్యోగులను శిక్షించవలసిందిగా కూడా పై కమిటీ సిఫారసు చేసింది. ఈ లొసుగుల బకాయిలను వసూలు చేయడానికి ప్రభుత్వం ప్రత్యేక చర్యలు తీసుకోబోతోంది.

# ముద్దుముద్దుగావుంది: ముద్దులప్రియుడు

చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

''ముద్దుల ప్రియుడు'' పేరు ముద్దుగా వుంది. పల్లెటూరి అమాయకత్వంతో మంచి తనం మూర్తీభవించిన మనిషిగా, ఒక ప్రేమ మూర్తిగా ముద్దులందించే హీరో రాముడు (వెంకటేష్) పెద్ద కళ్ళతో బొద్దు మీసాలతో, హార్థముతో కూడిన, పదాలతో, సౌహార్థము నిండిన సంభాషణలతో ఎంతో ముద్దుగా వున్నాడు. ఈ హీరోకు తోడైన ఇద్దరు హీరోయిన్లు ఉష (రంభ), సంధ్య (రమ్యకృష్ణ) ఈ ఇద్దరు ముద్దు గుమ్మలు ముద్దయిన నగుమోములతో, వాలుకన్నుల సిగ్గు దొంతరలలో వారిని తలచు కుంటేనే మనసు పులకరించే వయ్యారాలు ఒలికిస్తూ సింగారాలు ఒదిగిస్తూ ముద్దు ముద్దుగా వున్నారు. వేటూరి వ్రాసిన ''చిలక చిట్టెమ్మ చిదిమిన సిగ్గమ్మ'' అనే ప్రేమ గీతాన్ని పాడుతూ సంధ్య (రమ్యకృష్ణ) సీతారామశాస్త్రి వ్రాసిన ''వాళే గనుక నీతోనే గనక'' - అనే ప్రేమ గీతాలాపనతో ఉష (రంభ) హీరోతో సాగించిన నృత్యాలు, ఇంపు సొంపుల కులుకులు ఎంతో ముద్దుగా వున్నాయి. ఇక వేటూరి, సీతారామశాస్త్రి, కీరవాణి వ్రాసిన పాటలు ముద్దుల మూటలే. ఆ పాటలకు కీరవాణి కూర్చిన సంగీతం, వాయిద్యాల హోరు జోరుగా వున్నా, మధురమైన ముద్దుల పంటగా కుదిరింది. హీరో హీరోయిన్లు ప్రేమ ప్రవాహంలో యుగళ గీతాలు పాడుకుంటూ విహరించే ప్రకృతి దృశ్యాలు; వన్నె, వన్నె పుష్పాల పాన్పులు; జలపాతాలు, జల క్రీడలు, కొండ వాలులు, పచ్చని పంట పొలాలు, ఈ దృశ్యాలన్నీ తియ్యని ముద్దుల్లా సుందర తరము, హృదయానందకరంగా వున్నాయి. చూచే కన్నులను మైమరపించ గల వైవిధ్యంతో ప్రకృతి దృశ్యాలను గ్రహించిన ఛాయాగ్రాహకుడు కె. రవీంద్ర బాబు నైపుణ్యం ముద్దు ముచ్చటలకు నెలవు. కొత్త పంథాలో చాక్లెట్లు బిస్కట్లు, ఐస్ క్రీమ్‌లతో అమర్చిన సెట్టింగులో హీరో హీరోయిన్‌లు ఆడుతూ పాడుతూ వుండగా వారి కేరింతలు మనసును ఊరిస్తుంటే ముద్దు ముద్దుగా కమ్మ కమ్మగా కనిపించే ఆ చాక్లెట్లు, బిస్కట్లు, ఐస్ క్రీములను విందుగా ఆరగించి ఆమందానందం పొందాలన్న అనుభూతి కలుగుతుంది.

వీటన్నిటినీ ఇంత అందంగా, ఆకర్షణీయంగా, ఆనందంగా, ముద్దుగా రూపొందించిన దర్శకుడు కె. రాఘవేంద్ర రావు. ఈ సన్నివేశాలను, సందర్భాలను రూపొందించడంలో కనుపర్చిన స్పష్టమైన ఆలోచన, సమర్థవంతమైన శైలి, ఊహాప్రవాహం, ప్రశంసనీయం. బిగి కౌగిలిలోని గాఢమైన ముద్దులను మించిన మధురం మధురం.

కథా వస్తువు పాతదే. త్రికోణపు ప్రేమ వ్యవహారం. హీరో మతి చెలించి మొదటి ప్రియురాలిని మరవటం, మరో ప్రియురాలిని చేరటం, మరలా మతి స్థిర పడి గతం గుర్తు తెచ్చుకోవడం, మొదటి

కొరవ 12వ పేజీలో

# టొరంటోలో తెలుగు చిత్రం అడ్రసు లేదు!

సెప్టెంబర్ 8 నుంచి కెనడా 'టొరంటో' లో ప్రారంభమైన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో హిందీ, తమిళం, బెంగాలీ భాషల్లో తయారైన 25చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. ఇందులో మణిరత్నం రూపొందించిన తమిళ చిత్రాలు నాలుగు ఉండడం గమనార్హం. ఒక్క తెలుగు చిత్రం కూడా లేక పోవడం సిగ్గు చేటు! తెలుస్తోంది కదా మన చిత్రాలు ఏ స్థాయిలో ఉన్నాయో!

## బాలకృష్ణకు పుత్రోత్సాహం

శ్రీమతి లక్ష్మి పార్వతికి పుత్రోదయం కావాలని ఎన్.టి.ఆర్ చేయని యజ్ఞయాగాదులు లేవు. ఇంతలో బాలకృష్ణ కటాక్షింపబడ్డాడు. ఈయన సతీమణి శ్రీమతి వసుంధర సెప్టెంబర్ 6వతేది వేకువ ఝామున గుమ్మడి పండులాంటి మగశిశువును - భావి సూపర్ హీరోను ప్రసవించింది. ఈ దంపతులకు ఇంతకు ముందు బ్రాహ్మణి, తేజస్విని అనే ఇద్దరు పుత్రికారత్నాలు ఉన్నవిషయం విదితమే. ''నాకు వారసుదు కల్గినందుకు నా కన్నా నా అభిమానులు మరింత సంతోషిస్తారు'' అన్నారు బాలకృష్ణ అమితోత్సాహంతో. ఈ చిరంజీవి ఎన్.టి.ఆర్.కు 22 వ మనుమడు!

## రాజకీయ రంగంనుంచి సినిమాకు!

మాజీ మంత్రి కనుమూరి బాపిరాజు ప్రధాన పాత్ర ధరించే వి.ఐ.పి. క్రియేషన్స్ చిత్రం షూటింగ్ సెప్టెంబర్ 10 వ అన్నపూర్ణ స్టూడియోలో ప్రారంభమైంది. ఈ చిత్రం పేరు బహుశా ''బాపిరాజుగారి కోతలు'' అని ఉండొచ్చు.

# జనవాణి

3 పేజీ కొరవ

కాలనీలో కాపురం పెట్టి - నివాసులతో 'హారు కల్లు, సారాయి త్రాగము అని శపథం చేసి రాగ సత్యాగ్రహం చేస్తా..' అని పత్రికలు రోజు లో ఉ పాటు సత్యాగ్రహం చేసారు. ఆయన దృఢ దీక్షకు కార్మికులు చలించి పోయి, త్రాగుడు మానుతామని వాగ్దానం చేసాక దీక్షను మానారు. జిల్లాలో అనాటే కల్లు, సారా రాక్షసికి వ్యతిరేకంగా సత్యాగ్రహాన్ని నడిపిన సంస్కరణ వారి పాల్టి శ్రీరాములు.

-శె. సుజాతా నాగరాజ రావు

కావలి

## డబ్బుకు లోకం దాసోహం

ఎన్నికలు దగ్గర పడుతున్న కొద్ది రాజకీయ నాయకుల పాట్లు, పార్టీలలో తూట్లు పత్రికల్లో ప్రతి రోజూ ప్రజలు చదువు తూనే వున్నారు. డబ్బు లేక పోతే పార్టీ టిక్కెట్టుకు పేరు ప్రతిపాదనలోకి రాదు. అది లేకుంటే ప్రచారం లేదు. అలాగే గెలుపు కూడా లేదనేది అన్ని పార్టీల వారి దగ్గర నుండి ఓటరు వరకు ప్రతి ఒక్కరూ చెబుతుంటారు. ఈ విధంగా డబ్బున్న వాతే ఎన్నికలలో పోటీ చేస్తూ పోతే కోటి రూపాయలు వుండే వాడు ఎమ్మెల్యే, 5 కోట్లు వుండే వాడు ఎమ్పీ, 10 కోట్లు వుంటేనే మంత్రి, 100 కోట్లు వుంటెనే ముఖ్యమంత్రి అయ్యే పరిస్థితి ఏర్పడు తుంది. 'కులము గలవారు, గోత్రము గలవారు, విద్య చేత విర్ర వీగువారు చేసిరి కల్గిన వారికి జానిస కొడుకులు' అని వేమన సూక్తి. రాజకీయాల్లో డబ్బు, వేర ప్రవృత్తులను దూరం చేయాలని 'ఇలే వాయిస్ శేషన్' చేపడుతున్న చర్యలు అభినందనీయం. డబ్బు లేకుండా ఎన్నికలు జరిపించి సమర్థతకు పీట వేసే చర్యల్లో భాగంగా మిధాషులకు నెల్లూరు సీటు కేటాయించే విషయంలో అన్ని రాజకీయ పార్టీలూ చొరవ చూపించాలని మనవి.

నెల్లూరు -ఆత్మకూరు ప్రసాద్

## బలసిన బాలాజీనగర్ దోమలు

బాలాజీ నగర్ వాసులు ఏ జన్మలో ఏం పాపం చేసుకొన్నారో కాని ఈ జన్మలో దోమల బారిన పడ్డారు. ఫ్యాన్లు, దోమల నివారణ యంత్రాలు వీటిని ఏమి చేయలేక పోతున్నాయి. మనిషి పై వాలిన దోమలు కుట్టిన చోట పుండ్లు పడుతున్నాయి. ఎంత మందికి బోదకాళ్లు, మలేరియా రానున్నదో చెప్పలేం. మునిసిపాలిటీ కొన్ని రోజుల పాటు ప్రతి దినం దోమల నిర్మూలన పొగ యంత్రాన్ని బాలాజీ నగర్‌లో వుంచి ప్రజలను ఆదుకోవాలి.

-ఎస్.వి.ఎస్.కోటేశ్వర రావు

నెల్లూరు.

## మనమంతా భారతీయులం

ప్రస్తుతం కొందరు రాజకీయ వాదులు దురుద్దేశంలో బ్రాహ్మ ణులను నిందిస్తున్నారు. కులం పేరుతో కొన్ని వర్గాల ప్రజలను రెచ్చ గొట్టి అధికారంలోకి రావాలని చూస్తున్నారు. ఈ ధోరణి సరియైనది కాదు. అనాదిగా మన దేశం సెక్యులర్ దేశం. అన్ని కులాలు, జాతులు ఎప్పటి నుండో సఖ్యతగా వుంటున్నాయి. మతాలు, కులాల మధ్య ఇప్పటి చిచ్చుకు రాజకీయ పార్టీలే కారణం. ప్రపంచంలోనే సమైక్యత, సమగ్రతకు ప్రతిబింబమైన భారతీయులు నిరంతరం అదే మార్గాన సాగేందుకు దీక్షా బద్ధులు కావాలి.

జిల్లకొండూరు -ఆర్. రామారావు

## చలనం లేని ప్రభుత్వం

చక్కెర ధరలు ఆకాశానికి అంటి, ప్రజలు నానా అవస్థలు పడ్డాక మంత్రిత్వ శాఖలో జరిగిన కుంభకోణమే సమస్యకు కారణమని కేంద్ర ప్రభుత్వం తెలుసు కొంది. అంటే దొంగలు పడ్డ ఆరు నెలలకు కుక్కలు మొరిగినట్లు కేంద్ర ప్రభుత్వం పనిచేసింది. ప్రస్తుతం కాఫీ పొడి ధర ఆకాశంలో వుంది. రెండు నెలల క్రితం అరకిలో 35 రూపాయలుంటే ఇప్పుడు 65 రూపాయ లయ్యింది. ధరల పెరుగుదల పట్ల కేంద్ర ప్రభుత్వానికి చీమ కుట్టి నట్లైనా లేదు. ప్రజలు కష్టాలు ప్రజలే పరిష్కరించు కోవాల్సి వచ్చినప్పుడు ప్రభుత్వా లెందుకు?

నెల్లూరు -పి. అరుణకుమారి

## రాష్ట్రపతి నిరాడంబరత

దైవభక్తి గల రాష్ట్రపతి వుండడం దేశం చేసుకొన్న అదృష్టం. నిరాడంబరతలో కూడా మన రాష్ట్రపతి డాకర్ శంకర్ దయాళ్ శర్మకు ఎవరూ సాటి రారు. ఇటీవల రాష్ట్రపతి మూడు రోజుల పర్యటనలో ఉదయం వేళ తిరుమలలో జరిగె అర్చిత సేవలో టిక్కెట్లు కొన్న భక్తులను రానీయలేదు. రాష్ట్రపతి భద్రతకు ముప్పు వాటిల్ల తుందని అధికారులు ఈ చర్య తీసుకొన్నారు. ఈ విషయం తెలుసుకొన్న రాష్ట్రపతి మనసు చలించి పోయి విలపించారు. భగవంతుని ముందు అందరూ సమానులేనని వెంటనే భక్తులందరినీ అనుమతించ మని కోరి తన నిరాడంబరతను చాటారు.

-గునుపాటి వేణుగోపాల్

నెల్లూరు

## విద్యుత్‌శాఖ నిర్వాకం

నేను నెల్లూరు భక్తవత్సల నగర్‌లో కాపుర ముంటున్నాను. నెలకు మా ఇంటికి 150 యూనిట్ల విద్యుత్‌ను వాడుకొన్నందుకు 140 నుండి 150 రూపాయల వరకు బిల్లు వచ్చేది. కాని ఈ సంవత్సరం మే, జూన్ నెలలో నాట్ యూజింగ్ అంటూ రీడింగు తీయకుండా 40 రూపాయలకు బిల్ ఇచ్చారు. జూలై, ఆగస్టు నెలలకు సెప్టెంబరు 1 తేది బిల్ జారీ చేస్తూ ఒకేసారిగా 834 యూనిట్లు వాడుకొన్నందున 1135 రూపాయల ఛార్జి చేసారు. ఒక్క సారిగా బిల్లు పెరిగిన వైనాన్ని దర్గామిట్ట ఆఫీసులోని వున్నతాధి కారులకు విన్నవించినా ఫలితం లేకుండా పోయింది. జూలై నెలలో మేము కుటుంబ సమేతంగా వేరే చోటికి పోయి వుండినాము. మామూలుగా రెండు వందల యూనిట్లు లోపు విద్యుత్ వాడుకొన్న వినియోగ దారునికి యూనిట్‌కు ఒక్క రూపాయి ఛార్జి విధించాలి. అలా చేయకుండా 1.45 విధించిన విషయాన్ని ఏ అధికారికి చెప్పినా పట్టించు కోలేదు. ఎంతో శ్రమ పడి తెంగావీధిలోని విద్యుత్ కార్యాలయానికి పోయి అక్కడి గుమాస్తాకు వివరంగా పరిస్థితి వివరించగా 238 రూపాయలు తగ్గించారు. రెండు నెలల కొకసారి రీడింగు తీయ వలసిన వారు సరిగా తీయక వినియోగ దార్ల పై అధిక భారం వేస్తున్నారు. బిల్లులలోని తిక మకలను తెలుసు కోలేని వినియోగ దారులు ఎంతో నష్ట పోతున్నారు. ప్రజలకు సేవ చేయవలసిన శాఖ ఇలాంటి నిర్వాకాలు చేసి వినియోగ దారులను నష్ట పరుస్తున్నది.

నెల్లూరు -పి. లక్ష్మీనరసు

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

రేట్లు పెంచి కూర్చున్నా, ఎక్కడా సందులేకుండా పొలంతా క్రరని పూగిపోతుండడంగా వున్నది.

ఈవిధంగా తెచ్చిన మూటకూళ్ళు కళ్ళల ధూయిష్టమైన గంగాసదృశ జలతరంగిణి ఉయ్యాల కాల్వ గట్టున భుజించి, తెచ్చిన వాల్లుకానుం దిగరాల్చుకుని తెల్లవారే టప్పటికి అల్పిదా పాడు కుంటు యిళ్ళు చేరుకుంటున్నారు.

* * *

మిషన్ హైస్కూల్ పుత్రికను రాజాగారి హైస్కూలు పుత్రుడు అపహరించాడని పోలీసువారన్నారే ఆ సందర్భంలో కమిటీవారు యేమిచర్య పుచ్చుకొన్నారండి?



# శ్రీ వేణుగోపాల స్వామి దేవస్థానము

మూలాపేట - నెల్లూరు. ఫోన్ నెం - 29897

## బహిరంగ వేలము

### 3 ఎకరాల 94 సెంట్ల మాగాణి భూమిని బహిరంగ వేలములో విక్రయించుటను గురించి:

హైదరాబాద్, ఎండోమెంట్స్ డిపార్టుమెంటు కమీషనరు గారి ఆర్డరు నం. యం. 2/34098/93-1 27-5-1994 తేది ప్రకారము, నెల్లూరు జిల్లా, నెల్లూరు పట్టణము, మూలాపేటలో వేంచేసియున్న శ్రీ వేణుగోపాలస్వామి వారి తాలూకు నెలూరు టౌన్ చింతారెడ్డిపాళెం పోవు దారిలో మున్సిపల్ వాటర్ ట్యాంక్ వద్దనున్న ఈ క్రింద షెడ్యూలులో తెలిపినట్టి ఎ3-94 సెంట్ల మాగాణి భూమిని గోకులము, గోవర్ధనము అనే పేర్లతో పిలువబడే ప్లాటు నెం. 1 మరియు ప్లాట్ నెం. 2లో నున్న ఎ1-97 సెంట్లు మరియు ఎ1-97 సెంట్ల విస్తీర్ణము గల భూమిని 25.9.1994 తేది ఉదయం 10.00 గంటలకు గుంటూరు ఎండోమెంట్సు డిపార్టుమెంటు డిప్యూటీ కమీషనరుగారి సమక్షములో సదరు ప్లాట్లువుండు ప్రదేశములో పై దేవస్థానము మేనేజింగ్ ట్రస్టీ గారిచే టెండర్ కమ్ బహిరంగ వేలము ద్వారా విక్రయించబడును.

### సీలువేయబడిన టెండర్లు ప్రకటన ద్వారా పిలుచుటకు నిర్దేశించిన షరతులు

1. బహిరంగ వేలము పాటలో పాల్గొనదలచిన వ్యక్తులు ఒక్కొక్క ప్లాటుకు వారి అ... పతో పాటు రూ. 3,00,000/- (అక్షరములా మూడు లక్షల రూపాయలు) ధరావత్తు క్రింద డిమాండు డ్రాఫ్టు రూపముగా తీసుకొని సీలు వేయబడిన టెండరును బహిరంగ వేలము పా టకు ముందుగా స్వయంగా లేదా రిజిష్టర్డు పోస్టు ద్వారా మేనేజింగ్ ధర్మకర్త వారికి అందజేయవలెను. (డిమాండ్ డ్రాఫ్ట్, మేనేజింగ్ ట్రస్టీ శ్రీ వేణుగోపాల స్వామి దేవస్థానం, మూలాపేట, నెల్లూరు వారి పేర తీసుకొనవలెను).
2. బహిరంగవేలము పాట ప్రారంభించే ముందు హాజరైన టెండరు దార్ల సమక్షములో వేలపు పర్యవేక్షణ అధికారి గారిచే అందిన టెండర్లు తెరువబడును.
3. అట్టి టెండర్లలో అధిక ధరను హెచ్చుపాట (ఇనిషియల్ బిడ్)గా తీసుకొని బహిరంగ వేలము పాట ప్రారంభించబడును.
4. టెండరుదార్లే కాక ఇతరులు కూడా స్థిరాస్తి విక్రయ వేలము పాట షరతులకు లోబడి నిర్ణయించిన రూ. 3,00,000/- లు (అక్షరములా మూడు లక్షల రూపాయలు) ధరావత్తును బహిరంగ వేలము పాటకు ముందు చెల్లించి వేలము పాటలో పాల్గొన వచ్చును.

### బహిరంగ వేలము పాట షరతులు

1. ఈ వేలము పాట హిందూ దేవాదాయ ధర్మాదాయ శాఖ ఉప కమీషనరు వారి సమక్షములో జరుపబడును.
2. వేలము పాటలో పాల్గొన దలచిన వారు పాటకు ముందుగా ఒక్కొక్క ప్లాటుకు రూ. 3,00,000/- లు (అక్షరములా మూడు లక్షల రూపాయలు) ధరావత్తు చెల్లించి పాటలో పాల్గొనే నిర్ణయము.
3. హెచ్చు పాటదారు ధరావత్తు తప్ప, మిగిలిన వారి ధరావత్తులు పాట దరిమిలా ఇవ్వబడును. పాట దారులకైన ఏ విధమైన ఖర్చులు ఇవ్వబడవు.
4. ఈ వేలం పాట దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్ హైదరాబాద్ మరియు మేనేజింగ్ ట్రస్టి వారి ఆమోదపు ఉత్తర్వులకు లోబడి హెచ్చు పాటదారుని పేరున ఖాయపర్చ...ను.
5. పాట అయిన క్షణమే హెచ్చు పాటదారు తమ పాట మొత్తములో 1/3వ వంతు సొమ్ము దేవస్థానం మేనేజింగ్ ధర్మకర్త వారి వద్ద డిపాజిట్ చేయవలయును. ఆ విధముగా చెల్లించని యెడల పాట మొదట చెల్లించిన ధరావత్తు రొక్కమును అపరాధముగా దేవస్థానం అక్కౌంటునకు జమ కట్టుకొనుటయే కాక తిరిగి జరుప బడిన వేలములో వచ్చిన నష్టమును మొదటి హెచ్చు పాట దారు వద్ద నుండి 18% వడ్డీతో సహా రాబట్టుకొను అధికారము దేవస్థానం వారికి కలదు.
6. హైదరాబాదు, దేవాదాయ, ధర్మాదాయ శాఖ కమీషనరు వారి ఆమోదపు ఉత్తర్వులు తెలియ పరిచిన 15 దినములలో హెచ్చు పాట దారుడు మిగిలిన 2/3వ వంతు పాట సొమ్మును (ధరావత్తు సొమ్ము మినహాయించి) పూర్తిగా చెల్లించి తన స్వంత ఖర్చులతో రిజిష్టరు చేయించుకొన వలెను. ఆ విధముగా చెల్లించని యెడల మొదటి పాట ఆఖరున కట్టిన 1/3వ వంతు పాట సొమ్మును, ధరావత్తు సొమ్మును అపరాధము క్రింద దేవస్థానము అక్కౌంటుకు జమ కట్టు కొనుటయే కాక తిరిగి పాట పెట్ట బడి వేలములో నష్టము వచ్చిన యెడల సదరు నష్టమును 18% వడ్డీతో సహా హెచ్చు పాట దారు వద్ద నుండి రాబట్టుకొనే నిర్ణయం.
7. ఏ కారణముల చేతనైనా పాటను ఆపు చేయుటకు గాని, వాయిదా వేయుటకు గాని, కారణం తెలుపకయే నిలిపి వేయుటకు గాని మేనేజింగ్ ధర్మకర్త గారికి లేదా పాట నిర్వహించే అధికారి వారికి అధికారము కలదు.
8. హెచ్చు పాటదారుడు వేలమునకు ముందే నిర్దేశించిన స్థిరాస్థిని, పరిమితిని, సరిహద్దులను సరిచూచుకొని పాటలో పాల్గొన వలయును. పాట ఖాయపర్చిన అనంతరము పై విషయములో ఎట్టి తగాదాలు చేసినను దేవస్థానము వారికి సంబంధము లేదు.
9. కమీషనరు దేవాదాయ, ధర్మాదాయ శాఖ హైదరాబా... రు స్థిరాస్థి అమ్మకమును తిరస్కరించిన యెడల పాట ఆఖరున హెచ్చు పాటదారుడు చెల్లించిన 1/3వంతు సొమ్ము ధరావత్తుతో సహా తిరిగి చెల్లించ బడును. అట్టి సొమ్ము పై ఏ విధమైన వడ్డీ ఇవ్వబడదు.
10. హెచ్చు పాటదారుడు సబ్ రిజిష్ట్రారు వారు నిర్ణయించిన ధర ప్రకారము స్టాంపు డ్యూటీ వగైరాలు చెల్లించి తన స్వంత ఖర్చులతో పాట భూమిని రిజిష్టరు చేయించుకొను నిర్ణయము.
11. స్థిరాస్థి విక్రయ రిజిస్ట్రేషన్ అయిన వెంటనే కొనుగోలు చేయబడిన ఆస్థిని హెచ్చు పాటదారునికి స్వాధీనము చేయబడును.
12. మైనరుగాని, ఇన్‌సాల్వెంట్‌గాని పాటలో పాల్గొనరాదు.

### షెడ్యూలు

| గ్రామము పేరు మండలము మరియు జిల్లా | ప్లాటు పేరు, నెం. | సర్వే నెం. | విస్తీర్ణము | భూమి తరహా |
|---|---|---|---|---|
| శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానము, మూలాపేట, నెల్లూరు. | గోకులం అని పిలువబడే 1వ ప్లాటు | 875 | ఎ1.97సెం. | మాగాణి |
| శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానము, మూలాపేట, నెల్లూరు. | గోవర్ధనం అని పిలువబడే 2 వ ప్లాటు | 875 | ఎ1.97సెం. | మాగాణి |

వంశపారంపర్యపు ధర్మకర్తలు

ఆనం వివేకానందరెడ్డి, మేనేజింగ్ ట్రస్టీ

ఆనం చంద్రశేఖరరెడ్డి
మన్నెం లక్ష్మినాథ్‌రెడ్డి

తుమ్మల సుబ్బారెడ్డి
మన్నెం చంద్రమౌళి రెడ్డి

కె.వి. నారాయణ, మేనేజరు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,